ఇత్థం షాడ్గుణ్యాదిపాఠమాత్రం న మన్త్ర ఇతి సిద్ధే సంప్రతి స్వయం మన్త్రస్వరూపమాహ.—

సర్వేతి. కార్యాణి సన్ధ్యాదీని, తాని శరీరాణీవే త్యుపమితసమాసః. వ్యాఖ్యానే సౌగతానామివేతి లింగాత్. తేషు సర్వేషు కార్యశరీరేషు సర్వేషు శరీరేష్వివ, సర్వకార్యేష్విత్యర్థః. అంగాని స్కన్ధా ఇవేతి పూర్వవత్సమాసః. తేషాం పంచకం ముక్త్వా, స్కన్ధపంచకమివ అంగపంచకం ముక్త్వేత్యర్థః. పంచ పరిమాణమస్యేతి పంచకః. 'సంఖ్యాయాః స్సంజ్ఞాసంఘసూత్రాధ్యయనేషు' ఇతి కన్ప్రత్యయః. సుగతో భక్తిర్భజనీయో యేషాం సౌగతా బౌద్ధాః 'భక్తిః' ఇతి సూత్రేణ అణ్ప్రత్యయః. తేషామప్యాత్మేవ, మహీభృతామప్యన్యో మన్త్రో నాస్తి, కర్మణామారంభోపాయః, పురుషద్రవ్యసంపత్, దేశకాలవిభాగః, వినిపాతప్రతీకారః, కార్యసిద్ధిశ్చేతి పంచాంగాని, యథాహ కామందకః—'సహాయాస్సాధనోపాయా విభాగో దేశకాలయోః, విపత్తేశ్చ ప్రతీకారః సిద్ధిః పంచాంగ మిష్యతే' ఇతి. రూప వేదనా విజ్ఞానసంజ్ఞా సంస్కారాః పంచస్కన్ధాః. తత్ర విషయప్రపంచో రూపస్కన్ధః తజ్జ్ఞానప్రపంచో వేదనాస్కన్ధః. ఆలయవిజ్ఞానసంతానో విజ్ఞానస్కన్ధః నామప్రపంచస్సంజ్ఞాస్కన్ధః. వాసనాప్రపంచస్సంస్కారస్కన్ధః. ఏవం పంచధా పరివర్తమానో జ్ఞానసంతాన ఏవాత్మేతి బౌద్ధాః. ఏవంచ యథా బౌద్ధానాం సర్వేషు శరీరేషు స్కన్ధపంచకాతిరిక్త ఆత్మా నాస్తి, ఏవం రాజ్ఞాం ముక్తాంగపంచకాతిరిక్తో మన్త్రో నాస్తీత్యుపమాలంకారః. తచ్చ అస్మాకం సమగ్రమేవేత్యయమేవ యాత్రాకాల ఇతి భావః.

అవ. విచారింపఁబడిన విషయమును నెఱవేర్చుటకు విలంబము సల్పఁ దగదని నుడువుచున్నాఁడు.—

మన్త్రో యోధ ఇవాధీర స్సర్వాంగై స్సంవృతై రపి,
చిరం న సహతే స్థాతుం పరేభ్యో భేదశంకయా. ౨౯

టీ. సంవృతైః=గుప్తములగు, సర్వాంగైః=కర్మారంభోపాయము మున్నగుపంచాంగములతోడను (వక్షస్థలాదులతోడన్ను), ఉపలక్షితోఽపి=కూడికొనినదయ్యును, మన్త్రః=నీతికార్యాలోచనము, అధీరః=పిరికివాఁడైన, యోధ ఇవ=యుద్ధభటుఁడుంబోలె, పరేభ్యః=ఇతరులవలన(శత్రువులవలన), భేదశంకయా=మూఁడవవానికిఁ దెలియుననుభీతిచే (చీల్పఁబడుదుననుభయముచేత), చిరం స్థాతుం = ఆలస్యముచేయుటకు (చాలసేపు నిలువఁబడుటకు), నసహతే=ఓర్వదు.

తా. పిరికిబంటు రొమ్ము మొదలగు నవయవములనెల్లఁ గవచాదులతోఁ గప్పుకొనియు యుద్ధమున శత్రువులు భేదింతురనుభీతిచేఁ జాలసేపు నిలువనోపని యట్లే సంధ్యాదివిషయమగు కార్యాలోచనము గార్యారంభోపాయము మున్నగు పంచాంగములచే సుగుప్తంబయ్యు నితరులకుఁ దెలియునను సంశయమున విలంబమును సైఁపదు. ఆలోచింపఁబడినవిషయము బయల్పడినచో గార్యహాని యగుం గావున విలంబము సేయంజనదు.

శ. స.—మంత్రః, మంత్రః మంత్రౌ మంత్రాః మంత్రశబ్దః అ. పు.ప్ర. ఏ. యుధ్యతఇతి యోధః, యోధః యోధౌ యోధాః యోధశబ్దః అ. పు. ప్ర. ఏ. ఇవ అవ్య. అధీరః అధీరౌ అధీరాః అధీరశబ్దః అ.పు. ప్ర. ఏ. సర్వాణి చ తాన్యంగాని సర్వాంగాని తైః సర్వాంగైః, అంగేన అంగాభ్యాం అంగైః సర్వాంగశబ్దః అ. న. తృ.బ. సంవృతైః, సంవృతేన సంవృతాభ్యాం సంవృతైః సంవృతశబ్దః అ. న. తృ. బ. అపి అవ్య. చిరం అవ్య. న అవ్య. సహతే సహేతే సహంతే షహమర్షణఇత్యస్మా దకర్మకాద్ధాతోః కర్తరి వర్తమానే లటి ఆత్మనే పది ప్రథమపురుష ఏ...తః స్థాతుం తుమున్నంతమవ్య. పరస్మాత్ పరాత్, పరాత్ పరాభ్యాం పరేభ్యః పరశబ్దః అ. పు. ప్ర. బ. భేదస్యశంకా భేదశంకా తయా భేదశంకయా, శంకయా శంకాభ్యాం శంకాభిః భేదశంకాశబ్దః ఆ. స్త్రీ. తృ. ఏ.

అథ మంత్రితార్థక్రియావిళంబే దోష మాహ.—

మంత్రఇతి. సంవృతైః గుప్తైః సర్వాంగైః పూర్వోక్తైః ఉపాయాదిభిః ఉరస్థలాదిభి శ్చోపలక్షిత సర్వాంగ సంవృతో౽పీత్యర్థః. మంత్రో విచారః, అధీరో భీరుః, యుధ్యత ఇతి యోధః ఘటఇవ పచాద్యచ్. పరేభ్యః అన్యేభ్యో౽రిభ్యశ్చ. 'పరం దూ రాన్య ముఖ్యేషు పరో౽రి పరమాత్మనో'రితి వైజయంతీ. భేదో విదారణం, తృతీయగామిత్వంచ తస్య శంకయా చిరం స్థాతుం విళంబితు మిత్యర్థః. న సహతే న క్షమతే. 'శకధృ షే' త్యాదినా తుమున్ప్రత్యయః. అతో నవిళంబితవ్యం అన్యథా మంత్రభేదే కార్యహానిః స్యా దితి భావః.

అవ. మఱియు నీతి స్వరూపమునుఁబట్టియు విలంబముచేయరాదను నభిప్రాయమును చెప్పుచున్నాఁడు.—

ఆత్మోదయః పరజ్యాని ర్ద్వయం నీతి రితీయతీ,
త దూరీకృత్య కృతిభి ర్వాచస్పత్యం ప్రతాయతే. ౩౦

టీ. ఆత్మోదయః-ఆత్మ=తనయొక్క, ఉదయః=వృద్ధి, పరజ్యానిః-పర=శత్రువునియొక్క, జ్యానిః=హానియు, ఇతి=అను, ద్వయం=రెండు, ఇయతీ=ఇంతమాత్రమే, నీతిః=నీతిసంగ్రహము, తత్=ఆ రెంటిని, ఊరీకృత్య=అంగీకరించి, కృతిభిః=నేర్పరులచేత, వాచస్పత్యం = వాగ్మిత్వము, ప్రతాయతే=విస్తరింపఁబడుచున్నది.

తా. తనయభివృద్ధి శత్రునాశనము నను నీ రెండుమాత్రమే నీతియొక్క సారాంశములు. వీనినే నేర్పరులగు వారు పలుదెఱఁగుల విస్తరించి చెప్పుదురు. కావునఁ దనయభివృద్ధిఁగోరెడువాఁడు ప్రాలుమాలకయే శత్రువులఁ బరిమార్చవలయు.

శ. స.—ఆత్మనః ఉదయః ఆత్మోదయః, ఉదయః ఉదయౌ ఉదయాః ఆత్మోదయశబ్దః అ. పు. తృ. ఏ. పరస్య జ్యానిః పరజ్యానిః, జానిః జ్యానీ జ్యానయః పరజ్యానిశబ్దః ఇ. స్త్రీ. ప్ర. ఏ. ద్వౌ అవయవౌ అస్య ద్వయం ద్వయే ద్వయాని ద్వయశబ్దః అ. న. ప్ర. ఏ. నీతిః నీతీ నీతయః నీతిశబ్దః ఇ. స్త్రీ. ప్ర. ఏ. ఇతి అవ్య. ఇదం పరిమాణ మస్యా ఇతి ఇయతీ, ఇయతీ ఇయత్యౌ ఇయత్యః ఇయతీశబ్దః ఈ. స్త్రీ. ప్ర. ఏ. తత్ తే తాని తచ్ఛబ్దః ద. న. ద్వి. ఏ. ఊరీకృత్య ల్యబంతమవ్య. కృతినా కృతిభ్యాం కృతిభిః కృతిశబ్దః న. పు. ప్ర. బ. వచసాం పతిః వచస్పతిః వచస్పతేర్భావః వాచస్పత్యం, వాచస్పత్యం వాచస్పత్యే వాచస్పత్యాని వాచస్పత్యశబ్దః అ. న. ప్ర. ఏ. ప్రతాయతే ప్రతాయేతే ప్రతాయంతే ప్రపూర్వక తనువిస్తారే ఇత్యస్మాత్సకర్మకాద్ధాతోః కర్మణి వర్తమానే లటి ఆత్మనేపది ప్ర. ఏ.

కించ నీతిస్వరూపపర్యాలోచనయాపి న విళంబః కార్య ఇత్యభిప్రేత్యాహ.—

ఆత్మోదయ ఇతి ఆత్మనః ఉదయో వృద్ధిః, పరస్య జాని ర్హానిః. 'వీజ్యాహాజ్యారిభ్యో నిః' ఇత్యౌణాదికో నిప్రత్యయః ఇతి ద్వయం ఇదం పరిమాణమస్యా ఇయతీ ఏతావతీ. 'కిమిదంభ్యాం వో ఘః' ఇతి వతుపో వస్యఘః. 'ఉగితశ్చ' ఇతి జీప్. నీతి ర్నీతిసంగ్రహః, ఏతద్ద్వయాతిరిక్తో న కశ్చి న్నీతిసదార్థోఽస్తీత్యర్థః. య దన్యత్ షాడ్గుణ్యాదివర్ణనం, సర్వోఽప్యయ మస్యైవ ప్రపంచ ఇత్యాహ—తదితి తద్ద్వయ మూరీకృత్య

అంగీకృత్య, ఊరీకృత మురరీకృత మంగీకృత'మి త్యర్థః. 'ఊర్యాదిచ్వి డాచ శ్చే'తి గతిసంజ్ఞాయాం, 'కుగతిప్రాదయ' ఇతి సమాసే క్త్వో ల్యబాదేశః. కృతిభిః కుశలైః, వాచస్పత్యం వాగ్మిత్వం, కస్కాదిత్వాదలుక్స త్వే'షష్ఠ్యాః పతిపుత్రే'త్యాదినా సత్త్వ మితి స్వామీ తన్న ఛందోవిషయత్వాత్. బ్రాహ్మణాదిత్వాత్ ష్యఞ్ప్రత్యయః. ప్రతాయతే విస్తార్యతే, కర్మణి లట్ 'తనోతేర్య కీ'త్యాత్వం, తస్మా దాత్మోదయార్థిభి రవిళంబా చ్ఛత్రు రుచ్ఛేత్తవ్య ఇతి భావః.

అవ. వృద్ధిగలిగియున్నవానికి శత్రువులనునిరసించుటతో నేమి యనునట్లుగాదనుచున్నాఁడు.

తృప్తియోగః పరేణాపి న మహిమ్నా మహీయసామ్,
పూర్ణశ్చన్ద్రోదయాకాంక్షీ దృష్టాంతోఽత్ర మహార్ణవః. 30

టీ. మహీయసాం=మహాత్ములకు, పరేణాపి=ఉత్కృష్టమైనట్టియు, మహిమ్నా=ఐశ్వర్యముతో, తృప్తియోగః=తనివినొందుట, న=కూడదు, అత్ర=ఈయర్థమున, పూర్ణస్సన్=పరిపూర్ణుఁడయ్యును, చంద్రోదయాకాంక్షీ=చంద్రోదయమునుకోరుచున్న, మహార్ణవః=సముద్రుఁడు, దృష్టాన్తః=నిదర్శనము.

తా. సముద్రుఁడు జలపరిపూర్ణుఁడైననుఁ దనివినొందక చంద్రోదయమును నిరీక్షించుచున్నయట్లే రాజులు మిగుల నైశ్వర్యవంతులయినను నింతయ చాలుననక యింకను వృద్ధిఁబొందుటకు యత్నము జేయవలయునని భావము.

శ. స.— తృప్తేర్యోగః తృప్తియోగః, యోగః యోగౌ యోగాః తృప్తియోగశబ్దః అ. పు. ప్ర. ఏ. పరేణ పరాభ్యాం పరైః పరశబ్దః అ. పు. తృ. ఏ. అపి అవ్య. న అవ్య. మహతో భావః మహిమా తేన మహిమ్నా మహిమ్నా, మహిమభ్యాం మహిమభిః మహిమశబ్దః న. పు. తృ. ఏ. అత్యంతం మహాంతః మహీయాంసః తేషాం మహీయసాం, మహీయసః మహీయసోః మహీయసామ్ మహీయశ్శబ్దః స. పు. ష. బ. పూర్ణః పూర్ణౌ పూర్ణాః పూర్ణశబ్దః అ. పు. ప్ర. ఏ. చంద్రస్య ఉదయః చంద్రోదయః చంద్రోదయం ఆకాంక్షతీతి చంద్రోదయాకాంక్షీ, ఆకాంక్షీ ఆకాంక్షిణౌ ఆకాంక్షిణః చంద్రోదయా

కాంక్షిశబ్దః న. పు. ప్ర. ఏ. దృష్టః అంతః యస్మిన్ సః దృష్టాంతః, అంతః అంతౌ అంతాః దృష్టాంతశబ్దః అ. పు. ప్ర. ఏ. అత్ర త్రలంతమవ్య. అర్ణాంసి అస్మిన్ సంతీతి అర్ణవః మహాంశ్చాసావర్ణవశ్చ మహార్ణవః, అర్ణవః అర్ణవౌ అర్ణవాః మహార్ణవశబ్దః అ. పు. ప్ర. ఏ.

నను లబ్ధోదయస్య కిం పరోచ్ఛిత్త్యే నేత్యాహ.--

తృప్తియోగ ఇతి. మహీయసాం మహాత్మనాం, పరేణ ప్రకృష్టేనాపి, మహిమ్నా ఐశ్వర్యేణ, తృప్తియోగః మహానయ మస్మాకం విభవ ఏతావానేవ అల మితి సంతోషలాభః. న, అత్ర తృప్త్యభావే పూర్ణస్య చన్ద్రోదయాకాంక్షే, వృద్ధ్యర్థమితి భావః. మహార్ణవ స్సముద్ర ఏవ దృష్టాంతః దృష్టో అంతో నిశ్చయో యస్మిన్ స దృష్టాంతో నిదర్శనం, ఉపమాన మితి యావత్. న రాజ్ఞాం వృద్ధావలంబుద్ధిః కార్యా. 'అసంతుష్టా ద్విజా నష్టా స్సంతుష్టా ఇవ పార్థివాః, సలజ్జా గణికా నష్టా నిర్లజ్జాశ్చ కులాంగనే'తి న్యాయాదితి భావః. నాయం దృష్టాంతాలంకారః. బింబప్రతిబింబభావే నౌపమ్యస్య గమ్యత్వే తస్యోత్థానాత్. కింతు దృష్టాంతశబ్దేన తస్యాభిధానాత్ ఉపమాలంకారః. అతఏవ దృష్టాంతోదాహరణనిదర్శనరూపాః శబ్దా న ప్రయోక్తవ్యాః. పౌనరుక్త్యాపత్తేరి త్యేకావళ్యలంకారః.

"అసంతుష్టా ద్విజానష్టా స్సంతుష్టా ఇవపార్థివాః, సలజ్జాగణికానష్టా నిర్లజ్జేవకులాంగనా" యనున్యాయము నీయర్థమును చాటుచున్నది.

అవ. అట్లయినను దనివినొందుట యనర్థావహమనుచున్నాఁడు.

సంపదా సుస్థిరం మన్యో భవతి స్వల్పయాపి యః,
కృతకృత్యో విధి ర్మన్యే నవర్ధయతి తస్య తామ్. 3౨

టీ. యః=ఎవఁడు, స్వల్పయాపి=కొంచమైనను, సంపదా=కలిమిచేత, సుస్థిరంమన్యః=స్వస్థచిత్తుఁడననుకొనువాఁడు, భవతి=అగునో, తస్య=వానియొక్క, తాం=ఆసంపదను, కృతకృత్యః = తనపనినెఱవేర్చుకొనిన, విధిః = దైవము, నవర్ధయతి=పెంపొందఁజేయఁడు, ఇతి = అని, మన్యే=తలఁచెదను.

తా. కలిగినదానితో తృప్తిఁబొంది పురుషకారములేకుండనుండువానికి దైవముతోడ్పడఁడు అని తలంచెదను.

శ. స.—సంపదా సంపద్భ్యాం సంపద్భిః సంపచ్ఛబ్దః ద. స్త్రీ. తృ. ఏ. సుస్థిరమాత్మానమన్యతఇతి సుస్థిరంమన్యః,మన్యః మన్యౌ మన్యాః సుస్థిరమన్యశబ్దః అ.పు.ప్ర.ఏ. భవతి,భవతి భవతః భవంతి భూసత్తాయా మిత్యస్మాదకర్మకాద్ధాతోః కర్తరి వర్తమానేలటి పరస్మైపది ప్ర పు. ఏ. స్వల్పయా స్వల్పాభ్యాం స్వల్పాభిః స్వల్పాశబ్దః అ. స్త్రీ. తృ. ఏ. అపి అవ్య. యః యౌ యే యచ్ఛబ్దః ద. పు. ప్ర. ఏ. కర్తుం యోగ్యం కృత్యం కృతం కృతం కృత్యం యేనసః కృతకృత్యః,కృత్యౌ కృత్యౌ కృత్యాః కృతకృత్యశబ్దః అ. పు. ప్ర. ఏ. విధిః,విధీ విధయః విధిశబ్దః ఇ. పు. ప్ర. ఏ. మన్యే తిఙన్తప్రతిరూపకమవ్యయం న అవ్య. వర్ధయతి, వర్ధయతి వర్ధయతః వర్ధయంతి పృధువృద్ధావిత్యస్మాత్సకర్మకాణ్ణిజంతాత్కర్తరివర్తమానేలటి పరస్మై పది ప్రథమపురుషఏ. తస్య, తస్య తయోః తేషాం తచ్ఛబ్దః ద.పు.ష.ఏ. తాం తే తాఃతచ్ఛబ్దఃద. స్త్రీ.ద్వి.ఏ.

తథాపి సంతోషే దోష మాహ.—

సంపదేతి. యః స్వల్పయాపి సంపదా సుస్థిర మాత్మానం మన్యత ఇతి సుస్థిరంమన్యః, స్వస్థమానీ భవతి, 'అరుర్ద్విష దితి ముమాగమః. తస్య అల్పసంతుష్టస్య, తాం స్వల్పసంపదం, కృతకృత్యః తావతైవ కృతార్థః విధిః దైవమపి, న వర్ధయ తీతిమన్యే పౌరుషహీనం దైవమపి జుగుప్సతే తత్ప్రవృత్తేః పౌరార్థ్యా దితి భావః. మన్యే ఇత్యేతస్య వాక్యార్థః కర్మ. మన్య ఇత్యేత త్తిఙంతప్రతిరూపక మవ్యయమ్. 'మన్యే శంకే ధ్రువం రూపం ప్రాయ ఇత్యేవమాదయః' ఇతి.

అవ. ఇదిగాక పరాక్రమమువల్ల లభించినదియే యుదయము (వృద్ధి) గాని మఱియొండుగాదని చెప్పుచున్నాఁడు.—

సమూలఘాత మఘ్నంతః పరాన్నోద్యంతి మానినః,
ప్రధ్వంసితాంధతమసః తత్రోదాహరణం రవిః. 33

టీ. మానినః=మానవంతులు, పరాన్=శత్రువులను, సమూలఘాతం=మూలచ్ఛేదముగునట్లు, అఘ్నంతః=సంహరించనివారలై, నోద్యంతి=ఉదయము(వృద్ధి)నుబొందరు. తత్ర=ఆవిషయమున, ప్రధ్వంసితాంధతమసః-ప్రధ్వంసిత=(ఉదయించుటకుముందే) నశింపఁబడిన, అంధతమసః= గాఢాంధకారముగల, రవిః=సూర్యుఁడు, ఉదాహరణం = దృష్టాంతము.

తా. సూర్యుఁడు చీకటిని పోఁగొట్టి యుదయించు చందమున రాజులు శత్రువులను దునుమాడియే యభ్యుదయమును గాంతురు.

శ. స.——సమూలంహత్వా సమూలఘాతం ణములంతమవ్యయం: అఘ్నంతః, అఘ్నన్ అఘ్నంతౌ అఘ్నంతః అఘ్నచ్ఛబ్దః త.పు. ప్ర.బ. పరాన్,పరం పరౌ పరాన్ పరశబ్దః అ.పు.ద్వి.బ.న అవ్య. ఉదేతి ఉదితః ఉద్యంతి ఉత్పూర్వకేణ్ గతావిత్యస్మా దకర్మకాద్ధాతోః కర్తరి వర్తమానేలట్ పరస్మైపది ప్ర. బ. మానః ఏషామస్తీతి మానినః, మానీ మానినౌ మానినః మానిశబ్దః న. పు. ప్ర. బ. అంధయతీత్యంధం అంధంతమః అంధతమసం ప్రధ్వంసితం అంధతమసం యేనసః ప్రధ్వంసితాంధతమసః, తమసః తమసౌ తమసాః ప్రధ్వంసితాంధతమస శబ్దః అ. పు. ప్ర. ఏ. తత్ర త్రలంతమవ్యయం ఉదాహరణం ఉదాహరణే ఉదాహరణాని ఉదాహరణశబ్దః అ. న. ప్ర. ఏ. రవిః, రవిః రవీ రవయః రవిశబ్దః ఇ. పు. ప్ర. ఏ.

కించ పరాక్రమలబ్ధఏ వోదయో నాన్య ఇత్యాహ.—

సమూలఘాతమితి. మానినః అభిమానవంతః, పరాన్ శత్రూన్, సమూలంహత్వా సమూలఘాతం, అఘ్నంతః అనున్మూలయంతఇత్యర్థః.'సమూలాకృతజీవేషుహన్ కృఞ్గ్రహ'ఇతి ణముల్ప్రత్యయః. 'హనస్తోఽచ్చిణ్ణలోరి'తి నకారస్య తకారః. 'హో హంతేర్ఞ్ణిన్నేష్వి'తి కుత్వం. కషాదిషు యథావిధ్యనుప్రయోగ ఇతి హంతే రనుప్రయోగ తిః. నోద్యంతి ఉదయం నప్రాప్నువంతి, కింతు హత్వైవోద్యంతీత్యర్థః.తత్ర హత్వైవోదయే అంధయ తీత్యంధం గాఢం తత్తమః అంధతమసం. 'ధ్వాంతే గాఢేఽంధతమస మి'త్యర్థః. 'అవతమసమంధేభ్యస్తమస' ఇత్యచ్ప్రత్యయః. ప్రధ్వంసిత మంధతమసం యేన సః, ఉదయాత్ప్రాగితి భావః. రవిః. ఉదాహరణం దృష్టాంతః, అత్రాపి దృష్టాంతోఽత్ర మహార్ణవ ఇతి ఏ నుపమాలంకారః. న దృష్టాంత ఇతి ద్రష్టవ్యమ్.

అవ. ఇదియునుంగాక శత్రువులను జంపనిచోఁ బ్రతిష్ఠయే లేదనుచున్నాఁడు.——

విపక్ష మఖిలీకృత్య ప్రతిష్ఠాఖలు దుర్లభా,
అనీత్వా పంకతాం ధూళి ముదకం నావతిష్ఠతే. 38

టీ. విపక్షం=శత్రుపక్షమును, అఖిలీకృత్య = నిర్మూలముజేయక, ప్రతిష్ఠా=నిలువఁబడుట, దుర్లభాఖలు=దుర్లభముగదా, తథా

హి=అదియట్లేగదా, ఉదకం=నీరు, ధూళిం = (తనపైఁగ్రమ్ముకొని యెడు, దుమ్మును, పంకతాం=బురదయగుటను, అనీత్వా=పొందిం చక, నావతిష్ఠతే=ఉండదు.

తా. శత్రువర్గమును మొదలంటఁ దెగనఱికిననే గాని నెమ్మది గానిలువ వీలుగాదు. ఎగసి తనపైఁ గ్రమ్ముకొని వచ్చుధూళిని బురద గా నణఁగఁద్రొక్కియేగదా నీరు నిర్మలస్థితి నుండనోపును.

శ. స.—విరుద్ధ శ్చాసౌపక్షశ్చ విపక్షః తం విపక్షం, విపక్షం విపక్షౌ విపక్షాన్ విపక్షశబ్దః అ. పు. ద్వి. ఏ. అఖిలం ఖిలం కృత్వా ఖిలీకృత్య న ఖిలీకృత్య అఖిలీకృత్య ల్యబంతమవ్యయం ప్రతిష్ఠా,ప్రతిష్ఠా ప్రతిష్ఠే ప్రతిష్ఠాః ప్రతిష్ఠాశబ్దః ఆ. స్త్రీ.ప్ర.ఏ. ఖలు అవ్య. దుఃఖేన లబ్ధుంశక్యా దుర్లభా, దుర్లభా దుర్లభే దుర్లభాః దుర్లభాశబ్దః ఆ. స్త్రీ.ప్ర. ఏ. అనీత్వా త్వాప్రత్యయాంత మవ్య. పంకస్యభావః పంకతా తాం పంకతాం, పంకతాం పంకతే పంకతాః పంకతా శబ్దః ఆ. స్త్రీ.ద్వి.ఏ. ధూళిం, ధూళిం ధూళీ ధూళీః ధూళిశబ్ద. ఇ. స్త్రీ. ద్వి. ఏ. ఉదకం, ఉదకశబ్దఃఉదకం ఉదకే ఉదకాని అ.న.ప్ర. ఏ. అవ్య అవతిష్ఠతే, అవ తిష్ఠతే అవతిష్ఠేతే అవతిష్ఠంతే అవపూర్వక ష్ఠాగతి నివృత్తావిత్యస్మా దకర్మకాద్ధాతోః కర్తరి వర్తమానేలటి-ఆత్మనేపద ప్రథమపురుషైకవచ నాంతః.

కించ అనుచ్ఛిన్నశత్రోః ప్రతిష్ఠైవ దుర్లభేత్యాహ.—

విపక్షమితి. విపక్షంశత్రుపక్షం,అఖిలీకృత్యఖిలముత్సన్న మకృత్వా అనున్మూల్యేత్యర్థః 'ఖిలంతు ప్రహతిస్థానమి'తి యాదవః.ఖిలశబ్దాత్.'అభూతతద్భావే చ్వి'రితి చ్విప్రత్యయః. 'చౌ వి'తీత్వం. తతో నఞ్ సమాసశ్చ ప్రతిష్ఠాదుర్లభాఖలు తథాహి— ఉదకం కర్తృ ధూళిం, స్వపరిభావినీమిత్యర్థః. పంకతా మనీత్వా సాధః కృత్వేతి భావః. నావతిష్ఠతే, కింతు నీత్వైవ తిష్ఠ తీత్యర్థః.'సమవప్రవిభ్యః స్థ'ఇత్యాత్మనేపదం వాక్యభేదేన ప్రతిబింబసామ్యే దృష్టాంతాలంకారః.

అవ. ఒంటిగాఁ డీశిశుపాలుఁడు మనలనేమి జేయఁగలండన న ట్లుగా దనుచున్నాఁడు.—

ధ్రియతే యావదేకోఽపి రిపు స్తావ త్కుత స్సుఖమ్,
పురః క్లిశ్నాతి సోమం హి సైంహికేయోఽసురద్రుహామ్. 35

టీ. ఏకోఽపి=ఒక్కఁడైనను, రిపుః=శత్రువు, యావత్=ఎంత వఱకు, ధ్రియతే=నిలచియుండునో, తావత్=అంతదనుక, సుఖం=సౌఖ్యము, కుతః=ఎక్కడిది, తథాహి=అట్లేగదా, సైంహికేయః=రాహువు, అసురద్రుహాం=దేవతలయొక్క, పురః=ముందర, సోమం=చంద్రుని, క్లిశ్నాతి=బాధించుచున్నాఁడు.

తా. ఒక్కఁడేగదా శత్రువు మనకేమి భయమని యేమఱి యూరకుండరాదు. ఒకఁడైనను శత్రువుగలిగియుండునంతవఱకు సౌఖ్యముగలుగనేరదు. సింహికాతనయుఁడగు రాహువు రాక్షసవిదూరులగు దేవతుల సమక్షముననే చంద్రుని పీడించుచుండునుగదా?

శ. స. ధ్రియతే, ధ్రియతే ధ్రియేతే ధ్రియంతే ధృఙ్ అవస్థాన ఇత్యస్మాదకర్మకాద్ధాతోః కర్తరి వర్తమానే లటి ఆత్మనేపద ప్రథమపురుషైకవచనాంతః యావత్ అవ్య ఏకః, ఏకః ఏకం ఏకేన ఏకస్మై ఏకస్మాత్ ఏకస్య ఏకస్మిన్ ఏకశబ్దః అ. పు. ని. ప్రప. అపి, అవ్య రిపుః అనిష్టంరపతీతి రిపుః, రిపుః రిపూ రిపవః రిపుశబ్దః ఉ. పు. ప్ర. ఏ. తావత్ అవ్య. కుతః అవ్య. సుఖం, సుఖం సుఖే సుఖాని సుఖశబ్దః అ. న. ప్ర. ఏ. పురః, అవ్య క్లిశ్నాతి క్లిశ్నీతః క్లిశ్నంతి క్లిశూవిబాధనే ఇత్యస్మాత్సకర్మకాత్కర్తరి వర్తమానేలటి పరస్మైపది ప్రథ పు. ఏ. సోమం, సోమం సోమౌ సోమాన్ సోమశబ్దః అ. పు. ద్వి. ఏ. హి అవ్య సింహికాయా అపత్యం పుమాన్ సైంహికేయః, సైంహికేయః సైంహికేయౌ సైంహికేయాః సైంహికేయశబ్దః అ. పు. ప్ర. ఏ. అసురేభ్యః ద్రుహ్యంతీతి అసురద్రుహః తేషాం అసురద్రుహాం, ద్రుహః ద్రుహోః ద్రుహామ్ అసురద్రుట్ఛబ్దః హా. పు. ష. బ.

నన్వయ మేకాకీ శిశుపాలః. కి మస్మాకం కరిష్యతీ త్యాశంక్యాహ.—

ధ్రియఇతి. ఏకోఽపిరిపుః. యావత్ ధ్రియతే అవతిష్ఠతే, ధృఙ్ అవస్థాన ఇతి ధాతో స్తౌదాదికా త్కర్తరిలట్. 'రిఙ్ శయగ్లిఙ్క్ష్వి' తి రిఙాదేశః. తావ త్తదవధి సుఖం కుతః, 'యావ త్తావచ్చ సాకల్యేఽవధౌ మానేఽవధారణే' ఇత్యమరః. తథాహి సింహికాయా అపత్య పుమాన్ సైంహికేయో రాహుః, 'తమస్తు రాహు స్స్వర్భాను స్సైంహికేయో విధుంతుద' ఇ త్యమరః. 'స్త్రీభ్యో ఢక్' అసురద్రుహాం దేవానాం పురోఽగ్రే సోమం క్లిశ్నాతి బాధతే, ప్రాచుర్యా త్సోమ గ్రహణం సూర్యగ్రహణం చేతి భావః. తస్మా

దేశోఽపి శత్రుః ఛేత్తవ్యః. 'అగ్నేః శ్శేషమృణాచ్ఛేషం శత్రోశ్శేషం న శేషయే' దితి తాత్పర్యం. విశేషేణ సామాన్యసమర్థనరూపోఽర్థాంతరన్యాసః.

అవ. మిగుల దుర్బలుఁడగు నీ చేదిరాజు మనల నేమిజేయఁగల వాఁడని యందురని తలంచి వాఁడు ప్రబలుఁడని చెప్పుటకొఱకు శత్రు మిత్రులయొక్క బలాబలముల నిరూపించుచున్నాఁడు.—

సఖా గరీయాన్ శత్రుశ్చ కృత్రిమ స్తౌ హి కార్యతః,
స్యాతా మమిత్రౌ మిత్రేచ సహజప్రాకృతా వపి. 36

టీ. కృత్రిమః=ఉపకారరూపమగు క్రియవల్లనైన, సఖా=మిత్రుఁడు, గరీయాన్=ప్రబలుఁడు, (కృత్రిమః=అపకారరూప మగు క్రియవల్లనైన, శత్రుశ్చ=శత్రువును,) గరీయాన్=ప్రబలుఁడు, హి = ఏలనన, తౌ=ఆ కృత్రిమ మిత్రశత్రులు, కార్యతః=ఉపకారాపకారము లనెడు కార్యమువలన నైన, సహజప్రాకృతావపి = సహజమిత్రశత్రులును ప్రాకృత మిత్రశత్రువులును మాత్రము, అమిత్రౌ=శత్రువులుగను, మిత్రేచ =మిత్రులుగను గూడ, స్యాతాం=అగుదురు.

తా. కృత్రిమమిత్రుఁడు, సహజమిత్రుఁడు, ప్రాకృతమిత్రుఁడు నని కృత్రిమ శత్రువు, సహజశత్రువు, ప్రాకృతశత్రువునని శత్రువులును ముత్తెఱంగులం బరగుదురు. అం దుపకారము జేసినవాఁడు కృత్రిమ మిత్రుఁడు. పినతల్లి కొడుకులును పెత్తల్లికొడుకులును, మేనత్త మేనమామ కొడుకులును సహజమిత్రులు. తనదేశమున కానియున్న దేశమున కావలిదేశపురాజు ప్రాకృతమిత్రుఁడు. ఇట్లే అపకారము జేసినవాఁడు కృత్రిమశత్రువు. పినతండ్రి పెత్తండ్రులు వారి కొడుకులును సహజశత్రువులు. తనదేశమునకు సరిహద్దు దేశపురాజు ప్రాకృత శత్రువు ననియెఱుంగునది. ఇందు సహజప్రాకృతమిత్రశత్రువులు వారు జేయు నుపకారాపకారములంబట్టి మిత్రులుగను శత్రువులుగను మారుచుండవచ్చును. ఉపకారముజేసి మిత్రుఁ డగువాఁడును అపకారముజేసి శత్రువగువాఁడును మాత్రము తాఁజేసినయాకార్యము యావజ్జీవమును దొలఁగనిది కావున మిత్రుఁడు మిత్రుఁడుగను శత్రువు శత్రువుగను మాత్రమే యుందురు. కృత్రిమ మిత్రశత్రుత్వము ప్రబలమైనది యని భావము.

శ. స.—సఖా, సఖా సఖాయౌ సఖాయః సఖిశబ్దః ఇ. పు. ప్ర. ఏ. అత్యంతంగురుః గరీయాన్, గరీయాన్ గరీయాంసౌ గరీయాంసః గరీయశ్శబ్దః స. పు. ప్ర. ఏ. శాతయతీతిశత్రుః, శత్రుః శత్రూ శత్రవః శత్రుశబ్దః ఉ. పు. ప్ర. ఏ. అవ్య. క్రియయా నిర్వృత్తః కృత్రిమః, కృత్రిమః కృత్రిమౌ కృత్రిమాః కృత్రిమశబ్దః అ. పు. ప్ర. ఏ. సః తౌ తే తచ్ఛబ్దః ద. పు. ప్ర. ద్వి. హి. అవ్య. కార్యతః తసిలంత మవ్య. స్యాతాం, స్యాత్ స్యాతాం స్యుః అసభువీత్యస్మాదకర్మకాద్ధాతోః కర్తరి విధ్యాదౌ లజి పరస్మైపది ప్ర. పు. ద్వి. న. మిత్రే అమిత్రౌ, అమిత్రః అమిత్రౌ అమిత్రాః అమిత్రశబ్దః అ.పు.ప్ర.ద్వి. మిత్రం, మిత్రం మిత్రే మిత్రాణి మిత్రశబ్దః అ. న. ప్ర. ద్వి. చ. అవ్య. సహ జాత స్సహజః ప్రకృత్యా సిద్ధః ప్రాకృతః సహజశ్చ ప్రాకృతశ్చ సహజప్రాకృతౌ, ప్రాకృతః ప్రాకృతౌ ప్రాకృతాః సహజప్రాకృతశబ్దః అ. పు. ప్ర. ద్వి. అపి అవ్య.

నను క్షుద్రోఽయం చైద్యః కిం నః కరిష్యతీత్యాశంక్య తస్య బలవత్తాం వక్తుం మిత్రామిత్ర బలాబలవివేకం తావత్కరోతి.—

సఖేతి. క్రియయా ఉపకారాపకారాన్యతరరూపయా, నిర్వృత్తః కృత్రిమః. ద్వితః క్త్రిః, 'క్త్రేర్మమ్నిత్య' మితి మప్. సఖా సుహృద్గరీయాన్ బలీయాన్, ఏవం శత్రుశ్చ కృత్రిమో గరీయాన్, కుతః హి యస్మాత్ తౌ కృత్రిమమిత్రశత్రూ, కార్యతః ఉపకారాపకారరూపకార్యవశాత్, నిర్వృత్తావితి శేషః. ఉక్తకార్యోపాధ్యార్జిన మనపాయాదనయోర్మిత్రామిత్రభావోఽప్యనపాయీతి గరీయస్త్వమితి భావః. సహజప్రాకృతౌ తు నైవ మిత్యాహ—స్యాతామితి. సహజస్సహజాతః, ఏకశరీరావయవవాన్, తత్ర సహజం మిత్రం మాతృష్వసేయ పైతృష్వసేయాదిః, సహజశత్రుస్తు పితృవ్యతత్పుత్రాదిః, ప్రకృత్యా సిద్ధః ప్రాకృతః పూర్వోక్తకృత్రిమసహజలక్షణరహిత ఇత్యర్థః. తత్ర విషయానంతరః ప్రాకృతః శత్రుః తదనంతరః ప్రాకృతంమిత్రం, 'విషయానంతరో రాజా శత్రుర్మిత్ర మతః పర' మిత్యమరః. అపిశబ్ద స్త్వర్థే. తౌ సహజప్రాకృతౌ తు శత్రూ, అమిత్రౌ మిత్రే చ స్యాతాం, తాదాత్వికకార్యవశాదనియమేనోభయరూపతామాపద్యేతే న తు కృత్రిమవత్ శత్రుశ్శత్రురేవ, మిత్రంచ మిత్రమేవేతి. కృత్రిమావేవ మిత్రామిత్రౌ గరీయాంసౌ నతు సహజౌ, నాపి ప్రాకృతావిత్యర్థః. ఏతేన కృత్రిమత్వం సర్వాపవాదీతి సిద్ధమ్.

అట్లయిన మాకు మేనబావయగు శిశుపాలుఁడు సహజమిత్రుఁడు గనుక సంధిజేయవలయునేకాని యెదురఁజనదనిన నిట్లనుచున్నాఁడు.—

ఉపకర్త్రారిణా సంధి ర్న మిత్రే ణాపకారిణా,
ఉపకారాపకారౌ హి లక్ష్యం లక్షణ మేతయోః. 32

టీ. ఉపకర్త్రా = ఉపకారియగు, అరిణా = (సహజ, ప్రాకృత) శత్రువుతో, సంధిః = సంధి, కార్యః = చేయఁదగినది, అపకారముజేయు, మిత్రేణ = వి (సహజ, ప్రాకృత) మిత్రునితో, న = సంధిచేయరాదు. సాక్షాచ్ఛత్రువునితో సంధిజేయుట మిత్రునితో విరోధము జేయుటయు నెట్లు తగునన వారు చేయుపనిని బట్టి వారియందు ప్రబలమైన కృత్రిమమిత్ర శత్రుత్వములు గలిగినవి గావున నిది తప్పుగాదని నుడువుచున్నాఁడు.— హి = ఏమన, ఉపకారాపకారౌ = ఉపకారాపకారములు. ఏతయోః = ఈమిత్రశత్రువులకు, లక్షణం = స్వరూపముగ, లక్ష్యం = తెలియఁదగును.

తా. సహజ శత్రువుగాని ప్రాకృత శత్రువుగాని మేలుజేసిన ప్పుడు శత్రుభావమును దొలఁగించి ప్రబలమే యావజ్జీవము నట్లయుండు కృత్రిమ మిత్రత్వము జనించినది. కావున వానితో సంధి జేయనగును. ఇట్లే సహజ ప్రాకృత మిత్రుఁడు కీడుజేసినప్పుడును గృత్రిమ శత్రుత్వ ముదయించును. వానితో సంధిజేయం జనదు. కనుక శిశుపాలుఁడు సహజమిత్రుఁడై నను కృతిమ శత్రువుగాన వధార్హుండని భావము.

శ. స.—ఉపకరోతీ త్యుపకర్తా తేన ఉపకర్త్రా, కర్త్రా కర్తృభ్యాం కర్తృభిః కర్తృ శబ్దః ఋ.పు.తృ.ఏ. అరిణా, అరిణా అరిభ్యాం అరిభిః అరిశబ్దః ఇ.పు.తృ.ఏ. సంధిః, సంధిః సంధీ సంధయః సంధిశబ్దః ఇ.పు.ప్ర.ఏ. అవ్య, మిత్రేణ, మిత్రేణ మిత్రాభ్యాం మిత్రైః మిత్రశబ్దః అ.న.తృ.ఏ. అపకరోతీత్యపకారి తేన అపకారిణా, కారిణా కారిభ్యాం కారిభిః అపకారిశబ్దః న.న.తృ.ఏ. ఉపకారశ్చాపకారశ్చ ఉపకారాపకారౌ, ఉపకారాపకారౌ ఉపకారాపకారాభ్యాం ఉపకారాపకారయోః ఉపకారాపకారశబ్దః అ. పు. ని. ప్ర. ద్వి. హి. అవ్య. లక్షితుంయోగ్యం లక్ష్యం, లక్ష్యం లక్ష్యే లక్ష్యాణి లక్ష్యశబ్దః అ. న. ప్ర. ఏ. లక్షణం, లక్షణం లక్షణే లక్షణాని లక్షణశబ్దః అ. న. ప్ర. ఏ. ఏతస్య, ఏతస్య ఏతయోః ఏనయోః ఏతేషాం ఏతచ్ఛబ్దః ద.పు.ష.ద్వి.

ఏవం చేదస్మాకం పైతృష్వసేయశ్శిశుపాలస్సహజమిత్రత్వాత్సంధాతవ్యః. న తు యాతవ్య ఇత్యత్రాహ.—

ఉపకర్త్రేతి ఉపకర్త్రా ఉపకారిణా, అరిణాపి సహజేన ప్రాకృతేనవేతిశేషః సంధిః కార్యః అరిత్వాపవాదేన కృత్రిమమిత్రతాయాః బలీయస్త్వాద్యావజ్జీవభావిన్యాః తత్రోత్పన్నత్వాదితిభావః. ఏవమపకారిణాఽమిత్రేణాపిసహజేన ప్రాకృతేనవేతిశేషః. సంధిర్న కార్యః,మిత్రత్వాపవాదేన కృత్రిమశత్రుతాయాః గరీయస్త్వా యావజ్జీవభావిన్యాః. తత్రోత్పన్నత్వాదితిభావః. నను సాక్షాదరిణా కథం సందధ్యాత్ మిత్రేణ వా కథం విరుధ్యాత్.ఇత్యాశంక్య క్రియయా తయోర్వైపరీత్యాదదోష ఇత్యాహ—హి యస్మాత్కారణాత్. ఉపకారాపకారౌ ఏతయోః మిత్రామిత్రయోర్లక్షణం స్వరూపం,లక్ష్యం ద్రష్టవ్యం ఉపకర్తైవ మిత్రం అపకర్తైవ శత్రురిత్యర్థః. తస్మాత్సహజమిత్రత్వేఽపి చైద్యః క్రియయా శత్రుత్వాత్ యాతవ్య ఏవేతి భావః —

అవ. ఇంక నాలుగు శ్లోకములలో శిశుపాలుని కృత్రిమ శత్రుత్వమును చెప్పుచున్నాఁడు.—

త్వయా విప్రకృతశ్చైద్యో రుక్మిణీం హరతా హరే,
బద్ధమూలస్య మూలం హి మహ ద్వైరతరోః స్త్రియః. 38

టీ. హరే = ఓకృష్ణా, రుక్మిణీం=రుక్మిణిని, హరతా=కొనిపోవుచున్న, త్వయా=నీచేత, చైద్యః=శిశుపాలుఁడు, విప్రకృతః=అపకారము జేయఁబడెను, తథాహి=అదియట్లేగదా, బద్ధమూలస్య=వేఱునాటిన, వైరతరోః = పగయనుచెట్టునకు, స్త్రియః=జవ్వానులు, మహత్=ముఖ్యమైన, మూలంహి=వేరుగదా.

తా. బంధుగులందరు నాతనికిచ్చి పెండ్లిచేయ నిశ్చయించి యుండఁగా నాతని మేనమామకూఁతురగు రుక్మిణిని బంధుగుల యనుమతి వడయకయే నీవు బలాత్కారముగఁ గొనివచ్చుట శిశుపాలుఁడు శత్రువగుటకుం గారణమయ్యె. శత్రుత్వమను వృక్షమునకు యువతులు తల్లి వేరుగదా.

శ.స. త్వయా,త్వయా యువాభ్యాం యుష్మాభిః యుష్మచ్ఛబ్దః ద.పు.తృ.ఏ. విప్రకృతః,విప్రకృతః విప్రకృతౌ విప్రకృతాః విప్రకృతశబ్దః అ.పు.ప్ర.ఏ. చేదీనాంరాజా చైద్యః,చైద్యః చైద్యౌ చైద్యాః చైద్యశబ్దః అ.పు.ప్ర.ఏ.రుక్మిణీం,రుక్మిణీం రుక్మిణ్యౌ రుక్మిణీః రుక్మిణీశబ్దః ఈ. స్త్రీ.

ద్వి. ఏ.హారతీతి హారత్ తేన హరతా, హరతా హరద్భ్యాం హరద్భిః హరచ్ఛబ్దః ద. పు. తృ. ఏ. హేహరే, హేహరే హేహరీ హేహరయః హరిశబ్దః ఇ. పు. సం. ప్ర. ఏ. బద్ధంమూలంయస్యసః బద్ధమూలః తస్య మూలస్య, మూలస్య మూలయోః మూలానాం బద్ధమూల శబ్దః అ. పు. ష. ఏ. మూలం, మూలం మూలే మూలాని మూలశబ్దః అ. న. ప్ర. ఏ. హి అవ్య. మహత్, మహత్ మహతీ మహాంతి మహచ్ఛబ్దః ద. న. ప్ర. ఏ. వైరమేవ తరుః వైరతరుః తస్య వైరతరోః, తర్వోః తర్వోః తరూణాం వైరతరుశబ్దః ఉ. పు. ష. ఏ. స్త్రియః, స్త్రీ స్త్రియౌ స్త్రియః స్త్రీశబ్దః ఈ. స్త్రీ. ప్ర. బ.

అథ చైద్యస్య కృత్రిమశత్రుత్వం త్వయేత్యాదిచతుర్భి రాహ.—

త్వయేతి. హేహరే రుక్మిణీం హరతా, బంధుభి స్తస్మై దత్తాం రాక్షసధర్మేణోద్వహితేత్యర్థః. 'రాక్షసో యుద్ధహరణా' దితి యాజ్ఞవల్క్యః. 'గాంధర్వో రాక్షసశ్చైవ ధర్మ్యౌ క్షత్త్రస్య తౌ స్మృతా' వితి మనుః. త్వయా చైద్యో విప్రకృతః,తథాహి బద్ధమూలస్య రూఢమూలస్య,వైరతరోః స్త్రియః,మహ త్ప్రిధానం మూలం హి రూపకసంపృష్టోఽయ మర్థాంతరన్యాసః. సామాన్యేన విశేషసమర్థనరూపః.

అవ. ఆతఁడును నీ కపకార మొనర్చె నని నుడువుచున్నాఁడు.—

త్వయి భౌమం గతే జేతు మరౌత్సీ త్స పురీ మిమామ్,
ప్రోషితార్యమణం మేరో రంధకార స్తటీ మివ. 38

టీ. భౌమం=భూమికొడుకగు నరకాసురుని, జేతుః=గెలుచుటకు, త్వయి=నీవు, గతేసతి=చనియుండఁగా, సః=ఆ శిశుపాలుఁడు, ఇమాం=ఈ,పురీం=ద్వారకాపురమును, ప్రోషితార్యమణం-ప్రోషిత=అస్తమించిన, అర్యమణం = సూర్యుఁడుగల, మేరోః = మేరుపర్వతము యొక్క, తటీం=చరియను, అంధకారఇవ=కాఱుచీకటివలె, అరౌత్సీత్ = ముట్టడించెను.

తా. సూర్యుఁడు లేనియప్పుడు కాఱుచీకటి మేరుపర్వతము చరియలను గ్రమ్ముకొనినట్లు ఈ శిశుపాలుఁడు నీవు ప్రోలువిడిచి నరకాసురుని జయింపఁబోయినప్పుడు మన ద్వారకాపురమును ముట్టడించెను.

శ.స.—త్వయి, త్వయి యువయోః యుష్మాసు యుష్మచ్ఛబ్దః ద.పు.స.ఏ.భూమేరపత్యంపుమాన్ భౌమః తం భౌమం, భౌమం భౌమా

భౌమాన్ భౌమశబ్దః అ.పు.ద్వి.ఏ. గతే, గతే గతయోః గతేషు గత శబ్దః అ.పు.స. ఏ. జేతుం, తుమున్నంతమవ్య.అరౌత్సీత్ అరౌద్ధామ్ అరౌత్సుః రుదిర్ ఆవరణ ఇత్యస్మా త్సకర్మకాత్కర్తరి భూతేలజి పరస్మై ప్ర.పురు. ఏ.సః, సః తౌ తేతచ్ఛబ్దః ద.పు.ప్ర.ఏ. పురీం, పురీం పుర్యౌ పురీః పురీశబ్దః ఈ. స్త్రీ. ద్వి. ఏ. ఇమాం ఇమే ఇమాః ఇదంశబ్దః మ. స్త్రీ. ద్వి. ఏ. ప్రోషితః అర్యమా యస్యాస్సా ప్రోషితార్యమా తాం ప్రోషితార్యమణాం, అర్యమణం అర్యమణౌ అర్యమ్ణః ప్రోషితార్యమ శబ్దః న. స్త్రీ. ద్వి ఏ. మేరోః, మేరోః మేర్వోః మేరూణామ్ మేరుశబ్దః ఉ. పు. ష. ఏ. అంధం కరోతి త్యంధకారః, అంధకారః అంధకారౌ అంధకారాః అంధకారశబ్దః అ. పు. ప్ర. ఏ. తటీం, తటీం తట్యౌ తటీః తటీశబ్దః ఈ. స్త్రీ. ద్వి. ఏ. ఇవ, అవ్య.

అథ తేనాపి త్వం విప్రకృత ఇత్యాహ.—

త్వయీతి. భూమే రపత్యం పుమాంసం భౌమం, నరకాసురం, జేతుంత్వయిగతే సతి, స చైద్యః, ఇమాం పురీం ద్వారకాం ప్రోషితః అర్యమా సూర్యః యస్యా స్తాం మేరోః తటీం సాను మంధకారఇవ, అరౌత్సీత్ రుద్ధవాన్, రుధే రనిటో లుజి సిచి వృద్ధిః. ఉపమాలంకారః.

అవ. మఱియును.—

ఆల ప్యాల మిదం బభ్రో ర్య త్స దారా నపాహరత్,
కథాపి ఖలు పాపానా మల మశ్రేయసే యతః. ౪౦

టీ. సః=ఆ శిశుపాలుఁడు, బభ్రోః=బభ్రువను యాదవుని యొక్క, దారాన్=భార్యను, అపాహరదితియత్ = ఎత్తికొనిపోయె ననుట యేదికలదో, ఇదం=దీనిని, ఆలప్య అలమ్=ఉచ్చరింపఁదగదు, యతః=ఏలయన, పాపానాం=పాపాత్ములయొక్క, కథాపి = స్మరణ మును, అశ్రేయసే=అనర్థముకొఱకు, అలంఖలు= చాలునుగదా.

తా. పాపులఁ దలఁచుటయుఁ బాపము గలుగుటకుఁ గారణము గావున నది చెప్పకొనరాదు. గాని ఈ శిశుపాలుడు యాదవుఁడగు మన బభ్రువుభార్య నపహరించి తనకు భార్యగాఁ జేసికొన్నవాఁడు (అదియెంత యవమానము. యెంత సంతాప హేతువు).—

శ. స.—ఆలప్య ల్యబంతమవ్య.అలమ్ అవ్య.ఇదం, ఇదం ఇమే ఇమాని ఇదంశ్శబ్దః మ. న. ద్వి. ఏ. బభ్రోః బభ్ర్వోః బభ్రూణామ్ బభ్రుశబ్దః ఉ. పు. ష. ఏ. యత్ అవ్య. సః, సః తౌ తే తచ్ఛబ్దః ద. పు. ప్ర.ఏ. దారాః, దారాన్ దారైః దారేభ్యః దారాణాం దారేషు దారశబ్దః అ. పు. ని. ద్వి. బ. అపాహరత్, అపాహరతాం అపాహరన్ అపపూర్వక హృఞ్ హరణే ఇత్యస్మా త్సకర్మకాద్ధాతోః కర్తరి అనద్యతనభూతే లజ్ పరస్మై ప్ర. పురు. ఏ. కథా, కథా కథే కథాః కథాశబ్దః ఆ. స్త్రీ. ప్ర. ఏ. అపి అవ్య. ఖలు అవ్య. పాపస్య, పాపస్య పాపయోః పాపానాం పాపశబ్దః అ. పు. ష. బ. అలం అవ్య. న శ్రేయః అశ్రేయః తస్మై అశ్రేయసే, అశ్రేయసే అశ్రేయోభ్యాం అశ్రేయోభ్యః అశ్రేయశ్శబ్దః స. న. చ. ఏ. యతః అవ్య.

అపకారాంతర మాహ.—

ఆలప్యేతి. స చైద్యః, బభ్రోః యాదవభేదస్య, దారాన్ భార్యాం, 'భార్యా జాయాఽథ పుంభూమ్ని దారా స్స్యాత్తు కుటుంబి నీ'త్యమరః. అపాహర దితియత్ ఇదం దారాపహరణం ఆలప్య ఉచ్చార్య అలం నాలపనీయ మిత్యర్థః. 'అలం ఖల్వోః ప్రతిషేధయోః. ప్రాచాం క్త్వే'తి క్త్వాప్రత్యయః. సమాసేల్యబాదేశః. యతః పాపానాం పాపాత్మనాం కథా కథన ముచ్చారణమపి, 'చింతిప్రూజి కథికుంభిచర్చ శ్చే'త్యఙ్ప్రత్యయః. అశ్రేయసే అనర్థాయ అలం శక్తంఖలు, నమస్స్వస్తీ'త్యాదినాచతుర్థీ అత్ర నిషేధ్యమానాలపనకార్య మశ్రేయః ప్రాప్తిః తన్ముఖేన తత్కారణాలపననిషేధసమర్థనాత్, కార్యేణ కారణసమర్థనరూపోఽర్థాంతరన్యాసః.

అవ. ఫలితమును జెప్పుచున్నాఁడు.—

విరాద్ధఏవం భవతా విరాద్ధా బహుధాచ నః,
నిర్వర్త్యతేఽరిః క్రియయా సశ్రుతశ్రవస స్సుతః. ౪౧

టీ. ఏవం=ఇట్లు, భవతా=నీచేత, విరాద్ధః=అపకారముచేయఁబడినట్టియు, నః=మనకు, బహుధా=పలుతెఱంగుల, విరాద్ధా=అపకారియు, శ్రుతశ్రవసః=శ్రుతశ్రవస్సను కృష్ణుని మేనత్తయొక్క, సుతః=కొడుకునగు, సః=ఆశిశుపాలుఁడు, క్రియయా=(ఒకరికొక రపకారము చేసికొనుటయను) క్రియచేత, అరిః=కృత్రిమశత్రువుగా, నిర్వర్త్యతే=చేయఁబడుచున్నాఁడు.

తా. మేనత్త కొమారుండగుట సహజమిత్రుండయ్యును ఇట్లన్యోన్యాపకారము జేసికొనుటవలన కృత్రిమశత్రువయ్యెంగావున ప్రబలశత్రువగు నీశిశుపాలు నుపేక్షింపం జనదని తాత్పర్యము.

శ. స.—విరాద్ధః, విరాద్ధః విరాద్ధౌ విరాద్ధాః విరాద్ధశబ్దః అ. పు. ప్ర. ఏ. ఏవం అవ్య. భవతా, భవతా భవద్భ్యాం భవద్భిః భవచ్ఛబ్దః త.పు.తృ.ఏ. విరాద్ధా, విరాద్ధా విరాద్ధారౌ విరాద్ధారః విరాధృశబ్దః ఋ.పు.ప్ర. బహుధా అవ్య.చ అవ్య.నః, మమ మే ఆవయోః నౌ అస్మాకం నః అస్మచ్ఛబ్దః ద. పు. ష. బ. నిర్వర్త్యతే నిర్వర్త్యేతే నిర్వర్త్యన్తే నిర్‌పూర్వక వృతువర్తన ఇత్యస్మాత్సకర్మకాత్కర్మణి వర్తమానే లటి ఆత్మనే ప్ర.పు.ఏ. అరిః, అరిః అరీ అరయః అరిశబ్దః ఇ.పు. ప్ర.ఏ.క్రియయా,క్రియయా క్రియాభ్యాం క్రియాభిః క్రియాశబ్దః ఆ. స్త్రీ. తృ.ఏ. సః, సః తౌ తే తచ్ఛబ్దః ద. పు.ప్ర.ఏ. శ్రుతశ్రవసః, శ్రుతశ్రవసః శ్రుతశ్రవసోః శ్రుతశ్రవసాం శ్రుతశ్శ్రవశ్శబ్దః స. స్త్రీ. ష. ఏ. సుతః, సుతః సుతౌ సుతాః సుతశబ్దః అకారాంతః పు. ప్ర. ఏ.

ఫలిత మూహ.—

విరాద్ధఇతి. కించ ఏవం భవతా విరాద్ధః విప్రకృతః 'రాధేరనిటః కర్మణి క్తః. బహుధా నః అస్మాకం చ, విరాద్ధా విప్రకర్తా శ్రుతశ్రవానామ హరేః పితృష్వసా, తస్యాః సుతః పైతృష్వసేయత్వాత్సహజమిత్రమ పీతి భావః. సచైద్యః క్రియయా పూర్వోక్తాన్యోన్యాపకృియయా. అరిర్నిర్వర్త్యతే, కృత్రిమశత్రుః క్రియత ఇత్యర్థః. అతో బలీయస్త్వా దనుపేక్ష్య ఇతి భావః.

అవ. అయినను నుపేక్షించినచో ననర్థమగుననుచున్నాఁడు.—

నిధాయ వైరం సామర్షే నరోఽరౌ య ఉదాసతే,
ప్రక్షిప్యో దర్చిషం కక్షే శేరతే తేఽభిమారుతమ్. ౪౨

టీ. యే=ఏ, నరః=పురుషులు, సామర్షే=రోషముతోఁగూడిన, అరౌ = శత్రువునియెడ, వైరం = ద్వేషమును, విధాయ = చేసి, ఉదాసతే=ఉపేక్షింతురో, తే=వారు, కక్షే=(ఎండిన) పొదయందు, ఉదర్చిషం=పండునిప్పును, ప్రక్షిప్య=చిమ్మి, అభిమారుతం=గాలికెదురుగా, శేరతే=నిద్రించుచున్నారు.

తా. ముందే రోషావిష్టుఁడైయున్న శత్రువునియెడ నపకార మొనరించి మరింతపురికొల్పియుఁ దనను గాచుకొనఁ దగుపని జేయక యచ్చట యూరకుండువాఁడు యెండినగడ్డిమేటికి నిప్పంటించి గాలి కెదురుగా నిద్రించువానివలె చెడిపోవును.

శ. స.—విధాయ ల్యబంతమవ్య. వైరం, వైరం వైరే వైరాణి వైరశబ్దః అ.న.ద్వి.ఏ. అమర్షేణ, సహ వర్తతఇతి సామర్షః తస్మిన్ సామర్షే, సామర్షే సామర్షయోః సామర్షేషు సామర్షశబ్దః అ. పు. స.ఏ.నా,నా నరౌ నరః నృశబ్దః అ.పు.ప్ర.బ.అరౌ,అరా అర్యోః అరిషు అరిశబ్దః ఇ. పు. స. ఏ. యః, యః యౌ యే యచ్ఛబ్దః ద.పు.ప్ర.బ. ఉదాస్తే ఉదాసాతే ఉదాసతే ఉత్పూర్వకాదాస ఉపవేశన ఇత్యస్మాద కర్మకాద్ధాతోః కర్తరి వర్తమానే లటి ఆత్మనే ప్ర. పు. బ. ప్రక్షి ప్య. ల్యబంతమవ్య. ఉద్గతాని అర్చీంషి యస్య సః ఉదర్చిః తం ఉదర్చి షం,ఉదర్చిషం ఉదర్చిషౌ ఉదర్చిషః ఉదర్చిశ్శబ్దః న. పు. ద్వి. ఏ. కక్షే, కక్షే కక్షయోః కక్షేషు కక్షశబ్దః అ. పు. స. ఏ. శేతే శయాతే శేరతే శీఙ్ స్వప్న ఇత్యస్మాదకర్మకాత్కర్తరి వర్తమానేలటి ఆత్మనే ప్ర. పురు. బ. సః, సః తౌ తే తచ్ఛబ్దః ద. పు. ప్ర. బ. మారుతమభి అభిమారు తమ్ అవ్యయీభావావ్యయం.

అథాప్యుపేక్షాయాం దోష మాహ.—

విధాయేతి.యే నరః పుమాంసః. 'స్యుఃపుమాంసఃపంచజనాఃపురుషాః పూరుషా నర' ఇత్యమరః. సామర్షే ప్రాగేవ సరోషే, అరౌ వైరం విధాయ స్వయం చాప కృత్వేత్యర్థః. ఉదాసతే ఉపేక్షంతే ఆత్మరక్షానుకూలవ్యాపారశూన్యా భవంతి, తే నరః కక్షే గుల్మే,'కక్షౌతు తృణవీరుధా' విత్యమరః. 'కక్షస్తు గుల్మేదోర్మూలే పాపే జీర్ణవనే తృణే' ఇతి వైజయన్తీ. ఉదర్చిషి మర్చిష్మంత మగ్నిం, ప్రక్షిప్యాభిమారు తం, అభిముఖ్యేఽవ్యయీభావః. శేరతే స్వపంతి, తద్వ న్నాశహేతు రిత్యర్థః, 'శీఙో రు డి'తి రుడాగమః.అత్ర య ఉదాసతే తే శేరతే ఇతి విశిష్టోదాసీన్యశయన యోః వాక్యార్థయోః నిర్దిష్టైక్యాసంభవాత్ సాదృశ్యలక్షణాయా మసంభవద్వస్తుసం బంధో వాక్యార్థస్యేత్తి ర్నిదర్శనాభేదః న చాయం దృష్టాంతః. వాక్యభేదేన ప్రతి బింబకరణాపేక్షిత స్యోత్థానాత్. అత్ర తు వాక్యార్థే వాక్యార్థ సమారోపా ద్వా క్యైకవాక్యతాయాం తదభావా ది త్యలంకార సర్వస్వకారః.

అవ. అయినను బంధువుగాన క్షమింపఁదగునందురని శంకించి కొని యిట్లనుచున్నాఁడు.—

మనాగనభ్యావృత్త్యా వా కామం క్షామ్యతు యః క్షమీ,
క్రియాసమభిహారేణ విరాధ్యంతం క్షమేత కః. 43

టీ. యః=ఎవఁడు, క్షమీ=సహనశీలుఁడో, సః=వాఁడు, మనాక్=కొలఁది స్వల్పముగనైనను, అనభ్యావృత్త్యావా=ఒక్కమాఱైనను, విరాధ్యంతం=అపకారముచేయుచున్నవానిని, కామం=మిక్కిలి, క్షామ్యతు=క్షమింపవచ్చును, క్రియాసమభిహారేణ=ఎక్కుడుగను, మాటిమాటికిని-పలుమారులును, విరాధ్యంతం=అపకారము చేయువానిని, కః=ఎవఁడు, క్షమేత=సహించఁగలఁడు.

తా. ఎంతటి యోర్పుగలవాఁడైనను నెన్నఁడేని యొక్కసారిగాని మిగుల కొలఁదిగఁగాని యపకృతి యొనర్చినవాని సైచిన సైపవచ్చునే గాని పలుమరు పెక్కులపకారములఁ జేయువాని క్షమింపరాదు.

శ. స.—మనాక్ అవ్య. న అభ్యావృత్తిః అనభ్యావృత్తిః తయా అనభ్యావృత్త్యా, ఆవృత్త్యా ఆవృత్తిభ్యాం ఆవృత్తిభిః అనభ్యావృత్తి శబ్దః ఇ. స్త్రీ. తృ. ఏ. వా అవ్య. కామం అవ్య. క్షామ్యతు క్షామ్యతాత్ క్షామ్యతాం క్షామ్యంతు క్షమూష్ సహన ఇత్యస్మాత్సకర్మకాత్కర్తరి సంభావనాయాంలోటి పరస్మై ప్ర. పురు. ఏ. యః,యౌ యే యచ్ఛబ్దః ద. పు. ప్ర. ఏ. క్షమతఇతి క్షమీ, క్షమీ క్షమిణౌ క్షమిణః క్షమిశబ్దః న. పు. ప్ర. ఏ. క్రియాయా స్సమభిహారః క్రియాసమభిహారః తేన క్రియాసమభిహారేణ, హారేణ హారాభ్యాం హారైః క్రియాసమభిహారశబ్దః అ. పు. తృ. ఏ.విరాధ్యంతం, విరాధ్యంతం విరాధ్యంతౌ విరాధ్యంతః విరాధ్యచ్ఛబ్దః త. పు. ద్వి. ఏ.క్షమేత, క్షమేయాతాం క్షమేరన్ క్షమూష్ సహనఇత్యస్మా దకర్మకాత్కర్తరి శక్యార్థే లిఙి ఆత్మనే ప్ర. పు. ఏ. కః, కః కౌ కే కింశబ్దః మ. పు. ప్ర. ఏ.

తథాపి బాంధవత్వా త్సోఢవ్య ఇ త్యాశంక్యాహ.—

మనాగితి. యః క్షమీ సహనశీలః, 'శమి త్యష్టాభ్యోఘిను ణి'తి ఘినుణ్ప్రత్యయః. స సోఢా మనా గల్పంవా, అనభ్యావృత్త్యాపీతి భావః. అనభ్యావృత్త్యా సకృద్వా

అనల్పత్వే౽పీతి భావః. విరాద్ధ్యంత మపకుర్వాణం, కామం భృశం, క్షామ్యతు క్షమతాం, సంభావనాయాం లోట్. 'శమామష్టానాం దీర్ఘశ్శ్యని' తి దీర్ఘః. క్రియాసమభిహారేణ భృశం పౌనఃపున్యేన చేత్యర్థః. న చ పుంవాక్యే హ్యనేకార్థత్వం దోషాయ. విరాద్ధ్యంతం కః క్షమేత సహేత, సోఢుం శక్నుయాత్ నకో౽పీత్యర్థః. 'శకి లిఙ్చే'తి శక్యార్థే లిఙ్. 'క్షమూష్ సహనే' ధాతావాదికో దైవాదికశ్చ.

అవ. ఎల్లయెడలను బురుషుల కోరిమియే భూషణము గావునఁ దప్పుచేసినను క్షమించుట యుచితమన నిట్లనుచున్నాఁడు.—

అన్యదా భూషణం పుంసాం శమో లజ్జేవ యోషితామ్,
పరాక్రమః పరిభవే వైయాత్యం సురతేష్వివ. ౪౪

టీ. అన్యథా = సంభోగాతిరిక్తసమయమున, యోషితాం = యువతులకు, లజ్జేవ=సిగ్గువలెనే, పుంసాం=పురుషులకు, అన్యదా=తిరస్కారముగలుగనియప్పుడు, శమః=శాంతి, భూషణం=అలంకారము, పరిభవే=తిరస్కారముగలిగినపుడు (మాత్రము), సురతేషు=సంభోగములయందు, వైయాత్యమివ=ధార్ష్ట్యమువలె, పరాక్రమః=పౌరుషము, భూషణం=అలంకారము.

తా. ఎల్లవేళలయందును స్త్రీలు లజ్జయుంబోలె పురుషుండోర్పు గలిగియుండ వలసినదియే గాని సంభోగకాలమున స్త్రీలచాకచక్యముం బోలె యవమానముపట్లమాత్రము పురుషులు పరాక్రమముఁజూపుట కడుంగడు శ్లాఘనీయము.

శ. స.—అన్యస్మిన్ కాలే అన్యదా అవ్య. భూషణం, భూషణం భూషణే భూషణాని భూషణశబ్దః అ.న.ప్ర.ఏ. పుంసః, పుంసః పుంసోః పుంసామ్ పుంస్ శబ్దః స.పు.ష.బ. శమః, శమః శమౌ శమాః శమశబ్దః అ.పు.ప్ర.ఏ. లజ్జా, లజ్జా లజ్జే లజ్జాః లజ్జాశబ్దః ఆ. స్త్రీ. ప్ర.ఏ. ఇవ అవ్య. యోషితః, యోషితః యోషితోః యోషితామ్ యోషిచ్ఛబ్దః త. స్త్రీ. ష.బ. పరాక్రమః, పరాక్రమః పరాక్రమౌ పరాక్రమాః పరాక్రమశబ్దః అ. పు. ప్ర. ఏ. పరిభవే, పరిభవే పరిభవయోః పరిభవేషు పరిభవశబ్దః అ పు. స. ఏ. వియాతస్యభావః వైయాత్యం, వైయాత్యం వైయాత్యే వైయాత్యాని వైయాత్యశబ్దః అ.న.ప్ర.ఏ. సురతే, సురతే సురతయోః సురతేషు సురతశబ్దః. అ.న. స. బ. ఇవ అవ్య.

నను సర్వదాక్షమైవ పుంసాం భూషణ మతః అపరాధేఽపి క్షంతవ్యా మతఆహ.—

అన్యదేతి. అన్యదా సురతవ్యతిరిక్తకాలే యోషితాం లజ్జైవ పుంసోఽన్యదా అపరిభవే, శమః భూషణం, పరిభవేతు యోషితః, సురతేషు, వైయ్యాత్యం ధార్ష్ట్యమిన, 'ధృష్టే ధృష్ణు ర్వియాత శ్చే' త్యమరః. పరాక్రమః పౌరుషం, భూష్యతే అనేనేతి భూషణం ఆభరణం, ఏవంచ క్రియావచనత్వా న్నియతపుంలింగత్వావిరోధ ఇతి వల్లభోక్తం ప్రత్యుక్తమ్.

అవ. పరాభవముగలిగినను పరాక్రమము జూపకుండుటను మూడు శ్లోకములలో నిందించుచున్నాఁడు.—

మాజీవన్ యః పరావజ్ఞా దుఃఖదగ్ధోఽపి జీవతి,
తస్యాజనని రేవాస్తు జననీక్లేశకారిణః.　　४३

టీ. యః=ఎవఁడు, పరా...పి-పర=శత్రువుయొక్క(చేసిన), అవజ్ఞా=అవమానముచేతనయిన, దుఃఖ=దుఃఖముచేత, దగ్ధోఽపి=పరితప్తుఁడయ్యును, మాజీవన్=(కనుకనే) నిందితమైనజీవనముగలవాఁడై, జీవతి=బ్రతుకునో, జననీక్లేశకారిణః=తల్లికి (ప్రసవవేదనమున్నగు) కష్టములకలిగించిన, తస్య=వానియొక్క, అజననిరేవ = పుట్టుకలేమియే, అస్తు=అగునుగాక.

తా. శత్రువులచేత నవమానింపఁబడియుఁ బ్రతిక్రియ సేయనేరక బ్రతికియుండుటకంటె నట్టినిరర్థకుఁడగువాఁడు పుట్టకయే యుండినదల్లికి ప్రసవవేదన మొదలగు క్లేశములు లేకపోవునుగాన నదియే మేలనిభావము.

శ. స.—మా జీవతీతి మాజీవన్, మాజీవన్ మాజీవంతౌ మాజీవంతః మాజీవచ్ఛబ్దః త.పు.ప్ర. ఏ. యః, యః యౌ యే యచ్ఛబ్దః ద. పు. ప్ర. ఏ. పరస్య అవజ్ఞా పరావజ్ఞా, పరావజ్ఞయా దుఃఖం పరావజ్ఞా దుఃఖం పరావజ్ఞా దుఃఖేన దగ్ధః పరావజ్ఞా దుఃఖదగ్ధః, దగ్ధః దగ్ధౌ దగ్ధాః పరా...దగ్ధశబ్దః అ. పు. ప్ర. ఏ. అపి అవ్య. జీవతి జీవతః జీవంతి జీవప్రాణధారణ ఇత్యస్మాదకర్మకాద్ధాతోః కర్తరి వర్తమానేలటి పరస్మై ప్ర. పు. ఏ. తస్య,తస్య తయోః తేషాం తచ్ఛబ్దః ద. పు. ష. ఏ. న జననిః అజననిః, అజననిః అజననీ అజననయః అజననిశబ్దః ఇ. స్త్రీ. ప్ర. ఏ. ఏవ అవ్య. అస్తు స్తాత్ స్తామ్ సంతు అసభు వీత్యస్మాద

కర్మకాద్ధాత్తోః కర్తరి విధ్యాదౌలోటి పర. ప్ర. పు. ఏ. క్లేశం కరో తీతి క్లేశకారీ జనన్యాః క్లేశకారీ జననీక్లేశకారీ తస్య జననీక్లేశకారిణః, కారిణః కారిణోః కారిణామ్ జననీక్లేశకారిశబ్దః న. పు. ష. ఏ.

అథ పరిభవేఽప్యపరాక్రమే త్రిభిర్నిందా మాహ.—

మాజీవన్నితి. యః పరస్య కర్తుః అవజ్ఞయా అవమానేన, యద్దుఃఖం, తేన దగ్ధ స్తస్థోఽపి, అతఏవ, మాజీవన్ గర్హితజీవస్సన్. 'మాజ్యాక్రోశే' ఇతి లటశ్శత్రాదేశః. జీవతిప్రాణాన్ ధారయతి, జనన్యాః, క్లేశకారిణః, గర్భధారణప్రసవాది వేదనాకారిణః, తద్వ్యతిరిక్తార్థక్రియాహీనస్యేత్యర్థః. తస్యైవాజననమజనని రనుత్పత్తి రేవాస్తు జననీక్లేశనివృత్త్యర్థ మితి భావః. 'ఆక్రోశే న ఞ్యని' రితి నఞ్పూర్వాజ్జనిధాతో రనిప్రత్యయః.

పాదాహతం యదుత్థాయ మూర్ధాన మధిరోహతి,
స్వస్థా దేవావమానేఽపి దేహిన స్తద్వరం రజః. ౪౬

టీ. యత్=ఏ, రజః=ధూళి, పాదాహతంసత్=కాలితో త్రొక్కఁబడినదై, ఉత్థాయ=పైకెగసి, మూర్ధానం=త్రొక్కినవానిశిరస్సును, అధిరోహతి=ఎక్కుచున్నదో, తత్=ఆ, రజః=ధూళి, అవమానేఽపి=అవమానముగలిగినప్పుడును, స్వస్థాత్=సంతోషించియున్న, దేహినః=చేతనునికన్న, వరం=మేలు.

తా. అవమానము వచ్చినప్పుడు సయితము చీమకుట్టనియట్లు స్వస్థచిత్తుఁడయియుండు చేతనునికంటె నచేతనం బయ్యును కాలితోఁ ద్రొక్కినవాని నెత్తిమీఁదికెగయు ధూళిమేలు.

శ. స.—పాదేనా హతం పాదాహతం, ఆహతం ఆహతే ఆహతాని ఆహతశబ్దః అ. న. ప్ర. ఏ. యత్, యత్ యే యాని యచ్ఛబ్దః ద. న. ప్ర. ఏ. ఉత్థాయ ల్యబంతమవ్య. మూర్ధానం, మూర్ధానం మూర్ధానౌ మూర్ధ్నః మూర్ధశబ్దః స. పు. ద్వి. ఏ. అధిరోహతి అధిరోహతః అధిరోహంతి అధిపూర్వకరుహబీజ జన్మని ప్రాదుర్భావేచే త్యస్మాత్సకర్మకాద్ధాతోః కర్తరివర్తమానేలటి పరస్మై ప్ర. పు. ఏ. స్వస్థాత్, స్వస్థాత్ స్వస్థాభ్యాం స్వస్థేభ్యః స్వస్థశబ్దః అ. పు. పం. ఏ. ఏవ అవ్య. అవమానే, అవమానే అవమానయోః అవమానేషు అవమానశబ్దః అ. పు. స. ఏ. అపి అవ్య. దేహోస్యాస్తీ

తి దేహే తస్మాత్ దేహినః, దేహినః దేహిభ్యాం దేహిభ్యః దేహిశబ్దః న.పు.పం.ఏ. తత్,తత్ తే తాని తచ్ఛబ్దః ద. న.ప్ర. ఏ. వరం, వరం వరే వరాణి వరశబ్దః అ. న. ప్ర. ఏ. రజః రజసీ రజాంసి రజశ్శబ్దః స. న. ప్ర. ఏ.

పాదేతి. యద్రజః, పాదేన ఆహతం సత్, ఉత్థాయ ఉడ్డీయ మూర్ధానమాహంతురేవ శిరః, అధిరోహతి ఆక్రమతి, తద్రజః అచేతన మపీతి భావః అవమానే సత్యపి స్వస్థాత్సంతుష్టా ద్దేహినః చేతనా ద్వరం శ్రేష్ఠం, వ్యతిరేకాలంకారః.

అసంపాదయతః కంచి దర్థం జాతిక్రియాగుణైః,
యదృచ్ఛాశబ్దవ త్పుంస స్సంజ్ఞాయై జన్మ కేవలమ్. ४८

టీ. జాతిక్రియాగుణైః-జాతి=బ్రాహ్మణత్వము మొదలగుజాతిచేతను (గోత్వముమొదలగు జాతిచేతను), క్రియా=యజ్ఞము అధ్యయనము మొదలగు కర్మముచేతను (పాకాదిక్రియచేతను), గుణైః=శౌర్యముమొదలగు గుణములచేతను (తెలుపునలుపు మొదలగు గుణములచేతను), కంచిత్=ఒకానొక, అర్థం=పురుషార్థమును, అసంపాదయతః=సంపాదించని, పుంసః=పురుషునియొక్క, జన్మ=పుట్టుక, యదృచ్ఛాశబ్దవత్=ఇచ్ఛతోఁ గల్పించినశబ్దముల పుట్టుకయుంబోలె, సంజ్ఞాయై కేవలమ్=పేరుకొఱకుమాత్రమే.

తా. బ్రాహ్మణత్వము, క్షత్రియత్వము, వైశ్యత్వము, శూద్రత్వమునను నివిజాతులు. యజ్ఞము, వేదాధ్యయనము, ప్రజాపరిపాలనము, దుష్టనిగ్రహము, వాణిజ్యము, కృషి, మొదలగునవి వారికార్యములు. జ్ఞానమానాదులు, శౌర్యగాంభీర్యాదులు, సౌశీల్యాదులు వారి గుణములు. ఆయాజాతి పురుషుం డాయాగుణములు గలిగి యయ్యైకార్యములను నెఱవేర్చుచు సుకృతము, కీర్తి మున్నగు పురుషార్థములను సంపాదింపనిచో నాయాజాతియందు పుట్టినాఁడని పేరుమాత్రమేగాని సార్థక్య మేమియునులేదు. ఎట్టులన, వ్యాకరణమున శబ్దములు జాతిశబ్దములు, క్రియాశబ్దములు, గుణశబ్దములు, యదృచ్ఛాశబ్దములు నని నలుతెఱఁగులు గలవు. అందు గోశబ్దాదులు గోత్వాదిజాతిని దెలుపును. పాకాదిశబ్దములు వంట మొదలగు క్రియ

లను దెలుపును. శుక్లాదిశబ్దములు తెలుపు మొదలగు గుణములను దెలుపును. డిత్థ, డబిత్థ మొదలగు యదృచ్ఛాశబ్దములు సంజ్ఞామాత్రమేగాని గుణ క్రియాదులను దెలుపనేరమింజేసి నిరర్థకంబు లనంబడును. గావున శౌర్యాది సంపత్తియు శస్త్రవిద్యానైపుణ్యములు గలిగియు శత్రుసంహారము జేయనిచో మనకు క్షత్రియులను పేరు నిరర్థకమగునని భావము,

శ. స.—నసంపాదయతీ త్యసంపాదయన్ తస్య అసంపాదయతః అసంపాదయతః అసంపాదయతోః, అసంపాదయతాం అసంపాదయచ్ఛబ్దః త. పు. ష. ఏ. కం, కం కౌ కాః కింశబ్దః మ. పు. ద్వి. ఏ. చిత్. అవ్య అర్థం అర్థౌ అర్థాః అర్థశబ్దః అ. పు. ద్వి. ఏ. జాతిశ్చ, క్రియాచ గుణశ్చ జాతిక్రియా గుణాః తైః జా...ణైః, గుణేన గుణాభ్యాం గుణైః గుణశబ్దః అ. పు. తృ. బ. యదృచ్ఛయాశబ్దః యదృచ్ఛాశబ్దః యదృచ్ఛాశబ్దస్యేవ యదృచ్ఛాశబ్దవత్ వతిప్రత్యయాంతమవ్యయమ్. పుంసః, పుంసః పుంసోః పుంసామ్ పుంశ్శబ్దః స.పు.ష.ఏ. సంజ్ఞాయై, సంజ్ఞాయై సంజ్ఞాభ్యాం సంజ్ఞాభ్యః సంజ్ఞాశబ్దః ఆ. స్త్రీ. చ. ఏ. జన్మ, జన్మ జన్మనీ జన్మాని జన్మశబ్దః న.న.ప్ర.ఏ. కేవలమ్ అవ్య.

అసంపాదయతఇతి. కించ జాతిః బ్రాహ్మణత్వాదిః, క్రియా ఇజ్యాధ్యయనాదిః, గుణః శౌర్యాదిః, తైః సాధనైః కరణే తృతీయా. కంచి దర్థం సుకృతకీర్త్యాది పురుషార్థం, అన్యత్ర గోత్వపాకశౌక్ల్యాదిభిః స్వాభిధేయభూతైః కరణైః కంచి దర్థం మహానసాదివ్యవహారరూపం ప్రయోజన మసంపాదయతః ఉభయత్ర తాదృగ్జాత్యాద్యసంభవా దితి భావః. పుంసో జన్మ సత్తాలాభః, యదృచ్ఛాశబ్దవ దిచ్ఛాకల్పితస్య జాత్యాదిప్రవృత్తినిమిత్తశూన్యస్య డిత్థాదిశబ్దస్యేవ, 'తత్రతస్యే వే'తి వతిప్రత్యయః. 'స్వేచ్ఛా యదృచ్ఛా స్వచ్ఛంద స్సైరితా చ్ఛరితా స్సమా' ఇతి కేశవః. సంజ్ఞాయై కేవలం సంజ్ఞార్థమేవ, ఏకత్ర, పారిభాషికం కించిన్నామమాత్ర మనుభవితుం, అన్యత్ర తాదృఙ్నా మనుభవితు మి త్యర్థః.

ఇట్లు పౌరుషము లేమిం దూషించి పౌరుషమును భూషించుచున్నాఁడు.—

తుంగత్వ మితరా నాద్రౌ నేదం సింధా వగాధతా,
అలంఘనీయతా హేతు రుభయా తన్మనస్విని. ౪౯

టీ. అద్రౌ=పర్వతమందు, తుంగత్వం=ఔన్నత్యము, అస్తి=కలదు, ఇతరా=గాంభీర్యము (లోఁతు), నాస్తి=లేదు, సింధౌ=సముద్రమందు, అగాధతా=గాంభీర్యము (లోఁతు), అస్తి=కలదు, ఇదం=ఔన్నత్యము, నాస్తి=లేదు, మనస్విని=ధీరునియందు, అలంఘనీయతాహేతుః=అతిక్రమింపఁ బడమికిఁగారణమైన, తత్=ఆయౌన్నత్య గాంభీర్యములు రెండును గలవు.

తా. పర్వతములయం దౌన్నత్య మొక్కటియె యుండునుగాని గాంభీర్యములేదు. సముద్రమందు అగాధత్వ మొక్కటియే కలదుగాని యౌన్నత్యములేదు. ధీరులయం దీరెండునుంగలవు గావున వారల నెవ్వరు నతిక్రమింపఁజాలరని భావము.

శ. స.—తుంగస్య భావః తుంగత్వం, తుంగత్వం తుంగత్వే తుంగత్వాని తుంగత్వశబ్దః అ.న.ప్ర.ఏ. ఇతరా, ఇతరా ఇతరే ఇతరాః ఇతరాశబ్దః ఆ. స్త్రీ. ప్ర. ఏ. న అవ్య. అద్రౌ, అద్రౌ అద్ర్యోః అద్రిషు అద్రిశబ్దః ఇ. పు. స. ఏ. న అవ్య. ఇదం ఇమే ఇమాని ఇదంశబ్దః మ. పు. ప్ర. ఏ. సింధౌ, సింధౌ సింధ్వోః సింధుషు సింధుశబ్దః ఉ.పు.స.ఏ. అగాధస్య భావః అగాధతా, అగాధతా అగాధతే అగాధతాః అగాధతాశబ్దః ఆ. స్త్రీ. ప్ర. ఏ. లంఘితుం యోగ్యం లంఘనీయం న లంఘనీయం అలంఘనీయం అలంఘనీయస్యభావః అలంఘనీయతా అలంఘనీయతాయాహేతుః అలంఘనీయతాహేతుః, హేతుః హేతూ హేతవః అలంఘనీయతాహేతుశబ్దః ఉ.పు.ప్ర.ఏ. ఉభయం, ఉభయం ఉభయే ఉభయాని ఉభయశబ్దః అ.న.ప్ర.ఏ. తత్, తత్ తే తాని తచ్ఛబ్దః ద. న. ప్ర. ఏ. మనస్విని మనస్వినోః మనస్విషు మనస్విశబ్దః న. పు. స. ఏ.

ఏవ మపౌరుషం దూషయిత్వా పౌరుషం భూషయతి.—

తుంగత్వమితి. అద్రౌ తుంగత్వ మౌన్నత్య మస్తీతి శేషః. 'అస్తిర్భవంతి పరోఽప్రయుజ్యమానోఽప్యస్తీ' త్యాదిభాష్యాత్. భవంతీతి పూర్వాచార్యాణాం లట స్సంజ్ఞా. ఇతరా అగాధతా నాస్తి, సింధౌ సముద్రే అగాధతా గంభీరతా, అస్తి ఇదం తుంగత్వం నాస్తి, మనస్విని ధీరే తు, అలంఘనీయతాహేతు రలంఘ్యత్వకారణం, త దుభయం తుంగత్వమగాధత్వంచ, తస్మా దద్రిసింధుభ్యా మధికో మనస్వీతి వ్యతిరేకాలంకారః.

ఇపుడు విరోధియెడ మెత్తదనమును జూపుట యనర్థముకొఱ కగుననుచున్నాఁడు.—

తుల్యేఽపరాధే స్వర్భాను ర్భానుమంతం చిరేణ యత్,
హిమాంశు మాశు గ్రసతే తన్మ్రదిమ్నః ఫలం స్ఫుటమ్. ౪౯

టీ. స్వర్భానుః=రాహువు, అపరాధే=అపకారము, తుల్యేఽపి=సమానమైనను, భానుమంతం=సూర్యుని, చిరేణ=బహుకాలమునకు, గ్రసతే=మ్రింగుచున్నాఁడు, హిమాంశుం=చంద్రుని, ఆశు=శీఘ్రముగా, గ్రసత ఇతియత్ = మ్రింగుచున్నాఁడనుట యేదికలదో, తత్=అది, మ్రదిమ్నః=మెత్తదనమునకు, ఫలం=ఫలము, స్ఫుటం=స్పష్టము.

తా. తన కపకారము సమముగాఁజేసినను జండకిరణుండగు సూర్యుని చాలకాలమున కొక్కొక్కమారు మ్రింగుచున్న రాహువు చంద్రుని పదేపదే పీడించుచున్నాఁడు. ఇది యాచంద్రుఁడు చల్లనికిరణములుగలవాఁడగుటకు ఫలముగదా. కావున పగతురయెడ మెత్తదనము పనికిరాదు.

శ. స.—తుల్యే, తుల్యే తుల్యయోః తుల్యేషు తుల్యశబ్దః అ. పు. స. ఏ. అపరాధే, అపరాధే అపరాధయోః అపరాధేషు అపరాధశబ్దః అ. పు. ప్ర. ఏ. స్వర్భానుః, స్వర్భానుః స్వర్భానూ స్వర్భానవః స్వర్భానుశబ్దః ఉ. పు. ప్ర. ఏ. భానవః అస్యసంతీతి భానుమంతం, భానుమంతం భానుమంతౌ భానుమతః భానుమతచ్ఛబ్దః. త. పు. ద్వి. ఏ. చిరేణ అవ్య. యత్ అవ్య. హిమమయాః అంశవో యస్యసః హిమాంశుః తం హిమాంశుం, హిమాంశుం హిమాంశూ హిమాంశూన్ హిమాంశుశబ్దః ఉ. పు. ద్వి. ఏ. ఆశు. అవ్య. గ్రసతే గ్రసేతే గ్రసంతే గ్రసు గ్లసు అదన ఇత్యస్మాత్సకర్మకాత్కర్తరి వర్తమానే లటి ఆత్మనే ప్ర. పు. ఏ. తత్, తత్ తే తాని తచ్ఛబ్దః ద. న. ప్ర. ఏ. మృదోర్భావః మ్రదిమా తస్య మ్రదిమ్నః, మ్రదిమ్నః మ్రదిమ్నోః మ్రదిమ్నాం మ్రదిమ్నశబ్దః న. పు. ష. ఏ. స్ఫుటం, స్ఫుటం స్ఫుటే స్ఫుటాని స్ఫుటశబ్దః అ. న. ప్ర. ఏ. ఫలం, ఫలం ఫలే ఫలాని ఫలశబ్దః అ. న. ప్ర. ఏ.

సంప్రతి శత్రౌ మార్దవమనర్థాయేత్యాహ.—

తుల్యఇతి. స్వర్భానుః రాహుః, 'తమస్తు రాహుస్స్వర్భాను' రిత్యమరః. అపరాధే అపకారే తుల్యేఽపి, భానుమంతం సూర్యం, చిరేణగ్రసతే హిమాంశుం చంద్ర మాశుగ్రసతే, గిరతీతి యత్ 'గ్లసతేగ్రసతేర్గిర' ఇత్యభిధానాత్. తన్మృదిమ్నః మార్దవస్య ఫలం స్ఫుటం, తద్విపక్షే తీక్ష్ణేన భవితవ్యం అన్యదా మృదుస్సర్వత్ర బాధ్యత ఇతి భావః. ఏతచ్చ ప్రస్తుత మప్రస్తుతార్కేందుకథనేన సామాన్యాత్ప్రతీయత ఇత్యప్రస్తుతప్రశంసాభేదోఽయం.'అప్రస్తుతస్యకథనాత్ ప్రస్తుతం యత్ర గమ్యతే, అప్రస్తుతప్రశంసేయం సామాన్యాదినియంత్రితే' తి లక్షణాత్.

పైఁజెప్పిన విషయమునే మఱియొకవిధముగాఁ జెప్పుచున్నాఁడు.—

స్వయం ప్రణమతేఽల్పేఽపి పరవాయా వుపేయుషి,
నిదర్శన మసారాణాం లఘు ర్బహుతృణం నరః. ౫౦

టీ. అసారాణాం=దుర్బలులకు, నిదర్శనం=దృష్టాంతము గనుకనే, బహుతృణం=తృణప్రాయుఁడైన, లఘుః=పౌరుషములేని, నరః=పురుషుఁడు, అల్పేఽపి=తక్కువవాఁడైనను, పరవాయా=వాయువువంటి శత్రువు, ఉపేయుషి=వచ్చినప్పుడు, స్వయం=తనకు తానే, ప్రణమతే=నమ్రుఁడగును.

తా. మెల్లనగా వీచుగాలికి గడ్డిపరక యొఱగిపోవునట్లు తేలికయై పౌరుషమును జూపకయుండువాఁడు సామాన్య శత్రువుచేతనైనను వణఁచఁబడును.

శ. స.—స్వయం అవ్య. ప్రణమతే ప్రణమేతే ప్రణమంతే ప్రపూర్వక ణమప్రహ్వత్వే శబ్దేచే త్యస్మాదకర్మకాద్ధాతోః కర్తరి వర్తమానేలటి ఆత్మనే ప్ర.పురు.ఏ.అల్పే, అల్పే అల్పయోః అల్పేషు అల్పశబ్దః అ. పు. స. ఏ. అపి అవ్య. పరః వాయురివ పరవాయుః తస్మిన్ పరవాయౌ,వాయౌ వాయ్వోః వాయుషు పరవాయుశబ్దః ఉ.పు.స.ఏ. ఉపేయుషి, ఉపేయుషి ఉపేయుషోః ఉపేయివత్సు ఉపేయివచ్ఛబ్దః స. పు. స. ఏ. నిదర్శనం, నిదర్శనం నిదర్శనే నిదర్శనాని నిదర్శనశబ్దః అ.న.ప్ర.ఏ.నవిద్యతే సారో యేషాం తే అసారాః తేషాం అసారాణాం, అసారస్య అసారయోః అసారాణాం అసారశబ్దః అ.పు.ష.బ. లఘుః,

లఘుః లఘూ లఘవః లఘుశబ్దః ఉ. పు. ప్ర. ఏ. ఈషదసమా ప్తంతృణం బహుతృణమ్, బహుతృణం బహుతృణే బహుతృణాని బహుతృణశబ్దః అ. న. ప్ర. ఏ. నరః, నరః నరౌ నరాః నరశబ్దః అ. పు. ప్ర. ఏ.

ఏత దేవ భంగ్యంతరే ణాహ.—

స్వయమితి. అసారాణాం దుర్బలానాం నిదర్శనం దృష్టాంతః, అతఏ వేషదస మాప్తం తృణం బహుతృణం, తృణకల్ప మిత్యర్థః. 'విభాషాసుపో బహుచ్పురస్తా ది' తి బహుచ్ప్రత్యయః. ప్రకృతేః పూర్వం చ భవతి. 'స్యాదీషదసమాప్తౌ తు బహుచ్ప్రి కృతలింగ కే' ఇతి వచనాత్. ప్రకృతిలింగ తాలఘుః నిష్పౌరుషో నరః, అల్పేఽపి ఘరో వాయు రి వేత్యుపమితసమాసః బహుతృణ మితి స్పష్టోపమా సాహచర్యాత్. 'కల్పబ్దే శ్యదేశీయదేశ్యా దీ'తి దండినా కల్పబ్దాదీనా మౌపమ్యవాచకే ష్వభిధానాత్. తస్మి న్నుపేయుషి ప్రాప్తేసతి, స్వయం ప్రణమతే స్వయమేవ ప్రహ్వీభవతి, 'కర్మవ త్కర్మణా తుల్యక్రి యే' తి కర్మవద్భావే భావకర్మణో రి త్యాత్మనేపదం. 'నదుహ స్న నమాంయక్చిణా వి'తి సూత్రేణ యక్ప్రతిషేధః. వాయునా తృణమివ, అల్పీయసా ప్యరిణా లఘు ర్నరః అక్లేశేన పరిభూయత ఇత్యర్థః. ఉపమాలంకారః.

అవ. మరల పౌరుషమునందలిగుణమును దెల్పుచున్నాఁడు.—

తేజస్విమధ్యే తేజస్వీ దవీయా నపి గణ్యతే,
పఞ్చమః పఞ్చతపస స్తపనో జాతవేదసామ్. ౫౧

టీ. దవీయాన్ అపి=మిగుల దూరమున నున్నవాఁడయినను, తేజస్వీ=శౌర్యవంతుఁడు, తెజస్విమధ్యే=శౌర్యవంతులనడుమను, గణ్యతే=లెక్కపెట్టఁబడును, తథాహి=అట్లగదా, పంచతపసః=పంచాగ్ని మధ్యమున తపస్సుజేయువానికి, తపనః=సూర్యుఁడు, జాతవేదసాం= అగ్నులలో, పంచమః=ఐదవవాఁడు (అగుచున్నాఁడు).

తా. తేజశ్శాలి యెంతదూరమందున్నను తేజోవంతులలో నొకఁడుగాఁ దానును లెక్కింపఁబడును. సూర్యుఁడనేకయోజనములదూ రమందున్నను పంచాగ్ని మధ్యమున తపస్సు జేయువాని చుట్టునుండ వలయు నగ్నులలో నైదవవాఁడుగా భావింపఁబడుచున్నాఁడుగదా.

శ. స.— తేజోఽస్యాస్తీతి తేజస్వీ తేజస్వినాంమధ్యః తేజస్వి మధ్యః తస్మిన్ తేజస్విమధ్యే, మధ్యే మధ్యయోః మధ్యేషు తేజస్వి మధ్యశబ్దః అ. పు. స. ఏ. తేజోఽస్యాస్తీతి తేజస్వీ, తేజస్వీ తేజస్వినౌ

తేజస్వినః తేజస్విశబ్దః న. పు. ప్ర. ఏ. అత్యంతందూరః దవీయాక్, దవీయాంసౌ దవీయాంసః దవీయశ్శబ్దః స. పు. ప్ర. ఏ. అపి అవ్య. గణ్యతే గణ్యేతే గణ్యంతే గణసంఖ్యాన ఇత్యస్మాత్సకర్మకాత్కర్మణి వర్తమానేలటి ఆత్మ ప్ర. పురు. ఏ. పఞ్చానాం పూరణః పంచమః, పంచమః పంచమౌ పంచమాః పంచమశబ్దః అ. పు. ప్ర. ఏ. పంచభిః అగ్నిభిః సాధ్యం తపః యస్యసః పంచతపాః తస్య పంచతపసః, తపసః తపసోః తపసాం పంచతపశ్శబ్దః స. పు. ష. ఏ. తపతీతి తపనః, తపనః తపనౌ తపనాః తపనశబ్దః అ. పు. ప్ర. ఏ. జాతాః వేదాః యస్మాత్సః జాతవేదాః తేషాం జాతవేదసాం, జాతవేదసః జాతవేదసోః జాతవేదసాం జాతవేదశ్శబ్దః స. పు. ష. బ.

పునః పౌరుషే గుణ మాహ.—

తేజస్వీతి దవీయానతిదూరస్థోఽపి 'స్థూలదూర' ఇత్యాదినా పూర్వస్య గుణ యణాదిపరలోపౌ. తేజస్వీ, తేజస్వినాం మధ్యే, గణ్యతే సంఖ్యాయతే, తథాహి— పంచాగ్నిభిస్సాధ్యం తపో యస్య తస్య పంచతపసః, పంచాగ్ని మధ్యే తపస్యతః, తపనోఽర్కః జాతవేదసా మగ్నీనాం పంచమః పంచానాం పూరణః పంచమో జాతవేదా భవతీత్యర్థః. విశేషేణ సామాన్యసమర్థనరూపోఽర్థాంతరన్యాసః.

అకృత్వా హేలయా పాద ముచ్చై ర్మూర్ధసు విద్విషామ్,
కథంకార మనాలంబా కీర్తి ర్ద్యా మధిరోహతి. ౫౨

టీ. ఉచ్చైః=ఉన్నతములగు, విద్విషాం = శత్రువులయొక్క, మూర్ధసు=శిరస్సులయందు, హేలయా=లీలతో, పాదం=కాలును, అకృత్వా=పెట్టక, కీర్తిః=కీర్తి, కథంకారం=ఎట్లు, అనాలంబా=అవలంబనములేనిదియై, ద్యాం=ఆకాశమును, అధిరోహతి=ఎక్కును.

తా. నిచ్చెన మొదలగువాని నాధారము జేసికొనక యున్నత ప్రదేశముల మీఁదికెక్కుట దుర్లభముగదా! శత్రువుల తలలమీఁద కాలుబెట్టక కీర్తిస్వర్గమునకై బ్రాకఁగలదు? ఎగబ్రాకనేరదు. కావున కీర్తిగావలయునన్నవాఁడు తప్పక పౌరుషము నాశ్రయించితీరవలయును.

శ. స.—అకృత్వా క్త్వాప్రత్యయాంతమవ్య. హేలయా, హేలయా హేలాభ్యాం హేలాభిః హేలాశబ్దః ఆ. స్త్రీ. తృ.ఏ. పాదం పాదౌ పాదాన్ పాదశబ్దః అ. పు. ద్వి.ఏ. ఉచ్చైః అవ్య. మూర్ధని, మూర్ధ్నిమూర్ధ్నోః

మూర్ధసు మూర్ధశబ్దః న.పు.స.బ. విద్విషః, విద్విషః విద్విషోః విద్విషామ్ విద్విట్ఛబ్దః ష.పు.ష.బ. కథంకారం ణముల న్తమవ్య. అనాలంబా, అనాలంబా అనాలంబే అనాలంబాః అనాలంబాశబ్దః ఆ. స్త్రీ. ప్ర.ఏ. కీర్తిః, కీర్తిః కీర్తీ కీర్తయః కీర్తిశబ్దః ఇ. స్త్రీ. ప్ర. ఏ. ద్యాం, ద్యాం ద్యావౌ ద్యాః ద్యోశబ్దః ఓ. స్త్రీ. ద్వి.ఏ అధిరోహతి, అధిరోహతి అధిరోహతః అధిరోహంతి అధిపూర్వక రుహబీజజన్మని ప్రాదుర్భావే చేత్యస్మాత్సకర్మకాత్కర్తరి వర్తమానేలటి పరస్మై ప్ర. పురు. ఏ.

గుణాంతరం చ వ్యతిరేకేణాహ.—

అకృత్వేతి. ఉచ్చైరున్నతేషు, విద్విషాం శత్రూణాం, మూర్ధసు శిరస్సు, హేలయా లీలయా, పాదమకృత్వా అనిధాయ, 'అనఞ్పూర్వ' ఇతినిషేధాత్సమాసేఽపి నల్యబాదేశః. కీర్తిః కథంకారం కథమిత్యర్థః. 'అన్యథా ఏవం కథ మిత్థం సుసిద్ధాప్రయోగశ్చేది' త్యనర్థకాద్దేన కరోతేః కథంపూర్వాణ్ణముల్. అనాలంబా నిరాధారాసతీ కీర్తిః ద్యాం దినం, అధిరోహతి, నకథంచిదిత్యర్థః కించిన్నిశ్రేణ్యాదిక మనాక్రమ్య ఉత్సేధస్య దురారోహత్వా దితి భావః. తస్మాత్కీర్తి మిచ్ఛతా పౌరుష మేవాశ్రయణీయ మితి శ్లోకతాత్పర్యం. కీర్తితద్వ్యతిరేకభేదోపచారాత్సమానకర్తృకత్వనిర్వాహః అత్ర అప్రస్తుతాయాః కీర్తేర్విశేషణమహిమ్నా అప్రస్తుత ప్రాసాదారోహకస్త్రీవ్యవహారప్రతీతేస్సమాసోక్తిః.

పౌరుషమే మేలను నర్థమున నన్వయవ్యతిరేకదృష్టాంతములను జూపుచున్నాఁడు.—

అంకాధిరోపితమృగ శ్చంద్రమా మృగలాంఛనః,
కేసరీ నిష్ఠురక్షిప్తమృగపూగో మృగాధిపః. ౫౩

టీ. అంక=తొడను, అధిరోపిత=ఎక్కించుకొనఁబడిన, మృగః=లేడిగల, చంద్రమాః=చంద్రుఁడు, మృగలాంఛనః=మృగాంకుఁడని, ఖ్యాతః=పేరువడసెను, నిష్ఠురక్షిప్త మృగపూగః-నిష్ఠుర=కఠినముగా, క్షిప్త=అడల గొట్టఁబడిన, మృగపూగః=లేడిగుంపుగల, కేసరీ=సింహము, మృగాధిపః=మృగరాజని, ఖ్యాతః=పేరువడసెను.

తా. చంద్రుఁడొక జింకను తనతొడమీఁద నెక్కించుకొనియె. దానిచేత కళంకము గలిగి యాయనకు మృగాంకుండను పేరువచ్చినది. గుంపులు గుంపులుగా జింకలను క్రూరముగాఁ జంపు సింగమునకు మృగ

పర్యంతతయా పరిణామా త్పరిణామాలంకారః. 'ఆరోప్యమాణస్య ప్రకృతోప యోగిత్వే పరిణామ' ఇతి లక్షణాత్.

అవ. ఇఁక ప్రజ్ఞకును సయ్యది లేమికిని గల తారతమ్యమును రెండుశ్లోకములలో తెలియజేయుచున్నాఁడు.—

స్పృశంతి శరవ త్తీక్ష్ణా స్తోక మంత ర్విశంతిచ,
బహుస్పృశాఽపి స్థూలేన స్థీయతే బహిరశ్మవత్. ౭౮

టీ. తీక్ష్ణాః=చుఱుకైనవారు, శరవత్=బాణమట్లు, స్తోకం=కొంచెమే, స్పృశంతి = తాఁకుదురు, అంతః=(కార్యముయొక్కయు, కాయముయొక్కయు) నడిమిచోటునకు, విశంతి= చొరఁబడుదురు. బహుస్పృశాఽపి=అంతట వ్యాపించువాఁడయినను, స్థూలేన=బుద్ధి లేనివానిచేత (లావైనదానిచేత), అశ్మవత్ =జంత్రపుఱాయియట్లు, బహిరేవ=వెలుపలనే, స్థీయతే=ఉండుట.

తా. వాఁడి యైనబాణ మించుకంత తగిలియు శరీరములోనికి తీవ్రముగాఁ బోయి చొరఁబాఱునట్లు చుఱుకైన బుద్ధిగలవాఁడు కొలఁది ప్రయాసముననే గొప్పకార్యమును సాధింపఁగలుగును. పెద్దజంత్రపుఱాయి శరీరమంతటనుం దాఁకియు లోపలకు చొరలేనియట్లు మంద బుద్ధి గలవాఁ డెంతకష్టబడినను గార్యమును సాధింపనేరఁడని భావము.

శ. స.—స్పృశతి స్పృశతః స్పృశంతి స్పృశసంస్పర్శన ఇత్యస్మాత్సకర్మకాద్ధాతోః కర్తరి వర్తమానేలటి పర. ప్ర. పురు. బ. శరేణ తుల్యం శరవత్ వతిప్రత్యయాంతమవ్య. తీక్ష్ణాః, తీక్ష్ణః తీక్ష్ణౌ తీక్ష్ణాః తీక్ష్ణశబ్దః అ. పుం.ప్ర. బ. స్తోకం, స్తోకం స్తోకే స్తోకాని స్తోకశబ్దః అ. న.ద్వి. ఏ. అంతః అవ్య. విశతి విశతః విశంతి విశప్రవేశనఇత్యస్మాత్సకర్మకాద్ధాతోః కర్తరి వర్తమానేలటి పర. ప్ర. పు. బ. చ. అవ్య. బహుస్పృశతీతి బహుస్పృక్ తేన బహుస్పృశా, స్పృశా స్పృగ్భ్యాం స్పృగ్భిః బహుస్పృక్ఛబ్దః శ.పు. తృ.ఏ. అపి అవ్య. స్థూలేన, స్థూలేన స్థూలాభ్యాం స్థూలైః స్థూలశబ్దః అ.పు.తృ.ఏ. స్థీయతే స్థీయేతే స్థీయంతే ష్ఠాగతినివృత్తా విత్యస్మాదకర్మకాద్ధాతోః భావేలటి ఆత్మ. ప్ర. పురు. ఏ. బహిః అవ్యయము. అశ్మనాతుల్యం అశ్మవత్ మవతిప్రత్యయాంతమవ్య.

అథ ప్రజ్ఞాప్రజ్ఞయోః ద్వాభ్యాం వైషమ్యమాహ. —

స్పృశంతీతి. తీక్ష్ణాః నిశితప్రజ్ఞాః శరవత్ శరేణ తుల్యం, స్తోకమల్పమేవ, స్పృశంతి అంతః కార్శ్యస్య కౌయస్య చాంతరం, విశంతి చ అల్పాయాసేన బహు కార్యం సాధయంతీత్యర్థః. బహుస్పృశా వ్యాప్తేనాపి, స్థూలేన మందేన బృహతా చ, కార్యస్య అశ్మనా యంత్రోపలేన తుల్య మశ్మవత్, 'తేన తుల్యం క్రియాచే ద్వతిః' బహిరేవ కార్యస్య కౌయస్యేతి భావః, స్థీయతే స్థితిః క్రియతే, మూఢో హ్యల్పస్య హేతోర్బహు ప్రయస్యన్ మూషికగ్రహణాయ శిఖరిఖనక ఇవ పరిహాసాస్పదం భవతీతి భావః. తద్ధితగతేయ ముపమా.

ఆరభంతేఽల్ప మేవాజ్ఞాః కామం వ్యగ్రా భవన్తి చ,
మహారంభాః కృతధియ స్తిష్ఠంతి చ నిరాకులాః. ౭౯

టీ. అజ్ఞాః=మందబుద్ధులు, తుచ్ఛమేవ = నీచమైనపనినే, ఆరభంతే=మొదలుపెట్టుదురు. కామం=మిక్కిలి, వ్యగ్రాశ్చ=తొట్రుపడువారును, భవంతి=అగుదురు. కృతధియః = తీర్చినబుద్ధి గలవారు, మహారంభాః=గొప్పగొప్పపనుల నారంభించెడువార లగుదురు. నిరాకులాశ్చ=తొట్రుపాటులేనివారునై, తిష్ఠంతి=నిలువఁబడుదురు.

తా. మందమతు లత్యల్పకార్యములను మొదలుపెట్టుటయే గాక మిగుల తొట్రుపాటుజెంది తుద కది నెగ్గించుకొననేరరు. బుద్ధిమంతులు గొప్పగొప్ప పనులఁ జేయఁబూనియు నించుకంతయు తొట్రుపాటులేక నిలువఁబడి కొనసాగించుకొననేర్తురు.

శ. స.—ఆరభతే ఆరభేతే ఆరభంతే ఆఙ్పూర్వకరభ రాభస్య ఇత్యస్మాత్సకర్మకాత్కర్తరి వర్తమానేలటి ఆత్మ. ప్ర. పురు. బ. అల్పం, అల్పం అల్పే అల్పాని అల్పశబ్దః అ.న.ద్వి.ఏ. ఏవ అవ్య. నజానంతీత్యజ్ఞాః, అజ్ఞః అజ్ఞౌ అజ్ఞాః అజ్ఞశబ్దః అ. పు. ప్ర. బ. కామం అవ్య. వ్యగ్రః, వ్యగ్రః వ్యగ్రౌ వ్యగ్రాః వ్యగ్రశబ్దః అ. పు. ప్ర. బ. భవతి భవతః భవంతి భూసత్తాయామిత్యస్మాదకర్మకాద్ధాతోః కర్తరి వర్తమానేలటి పర. ప్ర. పురు. బ. చ అవ్య. మహాన్ ఆరంభః ఏషాం తే మహారంభాః, ఆరంభః ఆరంభౌ ఆరంభాః మహారంభశబ్దః అ. పు. ప్ర. బ. కృతా ధీః యైస్తే కృతధియః, ధీః ధియౌ ధియః కృతధీశబ్దః ఈ. పు. ప్ర. బ.

తిష్ఠతి తిష్ఠతః తిష్ఠంతి ష్ఠాగతి నివృత్తౌ ఇత్యస్మాదకర్మకాద్ధాతోః కర్తరి వర్తమానేలటి పర. ప్ర. పురు. బ. చ అవ్య. నిర్గతం ఆకులం యేభ్యస్తే నిరాకులాః, ఆకులః ఆకులౌ ఆకులాః నిరాకులశబ్దః అ. పు. ప్ర. బ.

ఆరభంతఇతి. కించ, అజ్ఞాః మందబుద్ధయః, అల్పం తుచ్ఛమేవ కార్యం, ఆరభంతే ఉపక్రమంతే, కామ మత్యంతం, వ్యగ్రా స్త్వరితాశ్చ, భవంతి, న చ పారం గచ్ఛంతీతి భావః. కృతధియః శిక్షితబుద్ధయస్తు, మహారంభాః మహోద్యోగా భవంతి, నిరాకులాః అవ్యగ్రాశ్చ తిష్ఠంతి పారం గచ్ఛంతీతిభావః.

అవ. ఇంకఁ బ్రజ్ఞావంతుఁడును బ్రమాద పడునని చెప్పుచున్నాఁడు.—

ఉపాయ మాస్థిత స్యాపి నశ్యం త్యర్థాః ప్రమాద్యతః,
హ న్తి నోపశయస్థో౽పి శయాళు ర్మృగయు ర్మృగాన్. ౨౦

టీ. ఉపాయం=ఉపాయమును, ఆస్థితస్యా౽పి=అవలంబించినవాఁడయినను, ప్రమాద్యతః =ప్రమాదపడువానియొక్క, అర్థాః=ప్రయోజనములు, నశ్యంతి =చెడిపోవును. తథాహి=అదియట్లే, శయాళుః=నిద్దురపోతగు, మృగయుః=వేఁటకాఁడు, ఉపశయస్థో౽పి =మాటున నున్నవాఁడయ్యును, మృగాన్=మృగములను, నహంతి = చంపలేఁడు.

తా. తొట్రుపాటులేక యుపాయముగా పనిచేయసమకట్టియు ప్రమాద పడుచుండెడివాని కార్యములు తుదనెగ్గక చెడిపోవును. వేఁటకాఁడు నిద్దరపోయెనయడల వలయొగ్గి తానుదాగుట కేర్పఱచుకున్నపల్లము (మాటు)న నుండియు మృగములను జంపలేడుగదా.

శ. స.—ఉపాయం, ఉపాయం ఉపాయౌ ఉపాయాన్ ఉపాయశబ్దః అ.పు.ద్వి.ఏ. ఆస్థితస్య, ఆస్థితస్య ఆస్థితయోః ఆస్థితానాం ఆస్థితశబ్దః అ.పు.ష.ఏ.అపి అవ్య.నశ్యతి నశ్యతః నశ్యంతి ణశ అదర్శన ఇత్యస్మాత్సకర్మకాద్ధాతోః కర్తరి వర్తమానేలటి పర. ప్ర. పురు.బ. అర్థః, అర్థః అర్థౌ అర్థాః అర్థశబ్దః అ.పు.ప్ర.బ.ప్రమాద్యతః, ప్రమాద్యతః ప్రమాద్యతోః ప్రమాద్యతాం ప్రమాద్యచ్ఛబ్దః త. పు. ష. ఏ. హంతి హతః ఘ్నంతి.

హానహింసాగత్యో రిత్యస్మా త్సకర్మకాద్ధాతోః కర్తరి వర్తమానే లటి పర. ప్ర. పురు. బ. న అవ్యయము. ఉపశయే తిష్ఠతీత్యుపశయ స్థః, స్థః స్థౌ స్థాః ఉపశయస్థశబ్దః అ. పు. ప్ర. ఏ. అపి అవ్య. శేతే ఇతి శయాళుః, శయాళుః శయాళూ శయాళవః శయాళుశబ్దః ఉ. పు. ప్ర. ఏ. మృగాన్ యాతీతి మృగయుః, మృగయుః మృగయూ మృగయవః మృగయుశబ్దః ఉ. పు. ప్ర. ఏ. మృగం, మృగం మృగౌ మృగాన్ మృగశబ్దః అ. పు. ద్వి. బ.

అథ ప్రజ్ఞావానపి ప్రమాద్యతీ త్యాహ.—

ఉపాయమితి. ఉపాయ మాస్థితస్య ప్రాప్తస్యాపి, ఉపాయేనైవ కార్యం సాధయతోఽపీత్యర్థః. కిముత వ్యగ్ర స్యేతి భావః. ప్రమాద్యతః అనవధానస్య, 'ప్రమాదోఽనవధాన తే'త్యమరః. అర్థాః ప్రయోజనాని, నశ్యంతి, తథాహి శయాళు ర్నిద్రాళుః, 'అళుచి శీఙో గ్రహణాదాళుచ్' మృగాన్ యాతీతి మృగయు ర్వ్యాధః, 'మృగయ్వాదయశ్చే'త్యౌణాదికః కుప్రత్యయాంతో నిపాతః. 'వ్యాధో మృగవధాజీవో మృగయు ర్లుబ్ధకశ్చ స' ఇత్యమరః. ఉపశేరతేఽస్మిన్ని త్యుపశయః మృగమార్గ స్థాయినో వ్యాధ స్యాత్మగుప్తిస్థానం గర్తవిశేషః. 'ఏరజ్' త్యచ్ప్రత్యయః తత్ర తిష్ఠతీ త్యుపశయస్థోఽపి మృగా న్నహంతి, విశేషేణ సామాన్యసమర్థనరూపోఽర్థాంతరన్యాసః.

అవ. ఇట్లు ప్రజ్ఞయత్యావశ్యకమని చెప్పి యిఁక నుత్సాహము యొక్క యక్కఱను జెప్పుచున్నాఁడు.—

ఉదేతు మత్యజ న్నీహాం రాజసు ద్వాదశ స్వపి,
జిగీషు రేకో దినకృదాదిత్యే ష్వివ కల్పతే. ౮౧

టీ. జిగీషుః = జయింప నిచ్ఛగించువాఁడు, ఏకః = ఒక్కఁడే, ద్వాదశసు=పన్నిద్దఱగు, రాజసు=రాజులలోనను, ద్వాదశసు-ఆదిత్యేషు=పన్నిద్దఱు సూర్యులలోను, దినకృదివ=పగలింటిదొరయుం బోలె, ఈహాం=ఉత్సాహ (శక్తి)మును, అత్యజన్=విడువకయే, ఉదేతుం=అభ్యుదయము బొందుటకు, కల్పతే=సమర్థుఁడగును.

తా. జయముగోరి జయింపఁబోవువాఁడు (జిగీషువు) నిరుద్యోగి గాక ఉత్సాహసంపన్నుఁడై మెలఁగినచో దినకరుండు ద్వాదశాదిత్యులయందునుంబోలె ద్వాదశరాజమండలమునం దత్యంతప్రాభవము

గలిగి మెఱయుచుఁ గులోద్దీపకుండగును. ఉత్సాహశక్తియే ప్రభుశక్తికి మూలమని తాత్పర్యము.

ద్వాదశరాజ మండల మనగా.—

1. ఉదాసీనుఁడు.—మండలమునకు వెలుపల నుపద్రష్టగా నున్నవాఁడు. ఇతఁడు మిగుల బలవంతుఁడు.

2. మధ్యముఁడు.—తగవరుల కుభయులకును సముఁడై చూచువాఁడు. వారుభయులు నేకమైనప్పు డనుగ్రహము జూపుటకును వేఱైనపు డణఁచుటకునుఁ జాలినవాఁడు.

3. శత్రుమిత్రమిత్రుఁడు.—ఇతఁడు కయ్యమున కెదుర్కొనఁబడిన వాని మిత్రునికి మిత్రుఁడుగాన జిగీషునకు శత్రువు.

4. మిత్రమిత్రుఁడు.—తనకు తోడైనవానికిఁ దోడ్పడువాఁడు కాఁబట్టి జిగీషునకు నమిత్రుఁడగును.

5. శత్రుమిత్రుఁడు.—శత్రువునకు తోడ్పడునుగాన జిగీషునకుశత్రువు.

6. మిత్రుఁడు.—శత్రువున కావలి దేశపువాఁడు గనుక జిగీషునకు మిత్రుఁ డయ్యెను.

7. శత్రువు.—ఇపుడు కయ్యమున కెదుర్కొనఁబడినవాఁడు ప్రక్క దేశపువాఁడు. ఇందు కడపటివైదుగురును జిగీషునియెదురఁ బడి పోరువారు.

8. జిగీషువు.—కయ్యమున కెదుర్కొన్నవాఁడు.

9. పార్ష్ణిగ్రాహుఁడు.—ఇతఁడు జిగీషుని వెనుక ప్రక్క దేశపువాఁడును ఇప్పుడు తనతోపాటు జయము గోరివచ్చువాఁడునుఁ గాన శత్రుప్రాయుఁడు.

10. ఆక్రందుఁడు.—పైవాని వెనుకప్రక్కవాఁడు. మిత్రప్రాయుఁడు.

11. పార్ష్ణిగ్రాహాసారుఁడు.—ఇతఁడు పార్ష్ణిగ్రాహుని మిత్రుఁడుగాన విజిగీషునకు విరోధిప్రాయుఁడు.

12. ఆక్రందాసారుఁడు.—ఇతఁ డాక్రందుని మిత్రుఁడుగాన జిగీషునకును మిత్రుఁడగును.

కడపటినలుగురును జిగీషుని వెనుకనుండి పోరు సల్పువారు.

ద్వాదశాదిత్యులు:—

1. ఇంద్రుఁడు. 2. ధాత. 3. పర్జన్యుఁడు. 4. త్వష్ట. 5. పూషుఁడు. 6. అర్యముఁడు. 7. భగుఁడు. 8. వివస్వంతుఁడు. 9. విష్ణువు. 10. అంశుమంతుఁడు. 11. వరుణుఁడు. 12. మిత్రుఁడు.

ఇందుఁ బ్రతిదినము నుదయించుసూర్యుఁడు దివాకరుఁ డనఁబడును.

శ. స.—ఉదేతుం తుమున్నంతమవ్య. అత్యాజః, అత్యాజః అత్యాజంతౌ అత్యాజస్తః అత్యాజచ్ఛబ్దః త. పు. ప్ర. ఏ. ఈహాం, ఈహాం ఈహే ఈహాః ఈహాశబ్దః ఆ. స్త్రీ. ద్వి.ఏ. రాజ్ఞి, రాజ్ఞి రాజని రాజ్ఞోః రాజసు రాజశబ్దః న.పు. స.ఏ. ద్వాభ్యాం అధికాః దశ ద్వాదశ (ద్వౌ చ దశ చ ద్వాదశ) తేషు ద్వాదశసు ద్వాదశ ద్వాదశభిః ద్వాదశభ్యః ౨ ద్వాదశానాం ద్వాదశసు ద్వాదశశబ్దః న. పు. నిత్య బ.స.బ.అపి అవ్య. జేతుమిచ్ఛుః జిగీషుః, జిగీషుః జిగీషూ జిగీషవః జిగీషుశబ్దః ఉ.పు.ప్ర. ఏ. ఏకః అ.పు.ని. ప్ర. ఏ. దినం కరోతీతి దినకృత్, దినకృత్ దినకృతౌ దినకృతః దినకృచ్ఛబ్దః త. పు. ప్ర. ఏ. ఆదిత్యే, ఆదిత్యే ఆదిత్యయోః ఆదిత్యేషు ఆదిత్యశబ్దః అ. పు. స.బ. ఇవ అవ్య. కల్పతే కల్పేతే కల్పన్తే కృపూసామర్థ్య ఇత్యస్మాదకర్మకాద్ధాతోః కర్తరి వర్తమానేలటి ఆత్మ. ప్ర. పురు. ఏ.

ఏవం ప్రజ్ఞాయా ఆవశ్యకత్వ ముక్తం. అథోత్సాహ స్యావశ్యకత్వ మాహ.—

ఉదేతుమితి. జేతు మిచ్ఛు ర్జిగీషుః ఏక ఏవ, ద్వాదశస్వపి, రాజసు మధ్యే, ద్వాదశ స్వాదిత్యేషు, దినకృ ద్దినకరణే వ్యాప్రియమాణః, ఆదిత్యః సఇవ ఈహాం ఉత్సాహ మత్యాజః ఉద్యోగాజాన ఏవ, న తు నిరుద్యోగ ఇతి భావః. ఉదేతుం కల్పతే ఉదయాయ ప్రభవతి ఉత్సాహశక్తిరేవ ప్రభుశక్తే ర్మూల మి త్యర్థః. 'నానాలింగత్వా న్మృతూనాం నానాసూర్యత్వ' మితి శ్రుతేః. ప్రతిమాస మాదిత్యభేదా ద్ద్వాద

కత్వం, తచ్చైకస్యైవ ద్వాదశాత్మత్వం. 'ద్వాదశాత్మా దివాకర' ఇత్యభిధానాత్, తే చార్యమాదయః పురాణోక్తా ద్రష్టవ్యాః, రాజానస్తు 'అరిర్మిత్ర మరేర్మిత్రం మిత్రమిత్ర మతఃపరం, అథారిమిత్రమిత్రం చ విజిగీషోః పురస్సరాః' పంక్తిశేషః 'పార్ష్ణిగ్రాహ స్తతః పశ్చా దాక్రంద స్తదనంతరం, ఆసారా వనయోశ్చైవ విజిగీషోస్తు పృష్ఠతః' పార్ష్ణిగ్రాహాసార ఆక్రందాసారశ్చేత్యర్థః అత్ర చత్వార ఇతి శేషః ఏవం చ నవ భవంతి, విజిగీషు ర్దశమః. 'అరేశ్చ విజిగీషోశ్చ మధ్యమో భూమ్యనంతరః, అనుగ్రహే సంహతయోః సమర్థో వ్యస్తయోర్వధే. మండలాద్బహి రేతేషా ముదాసీనో బలాధికః' ఇతి. మధ్యమోదాసీనాభ్యాం సహ ద్వాదశ వేదితవ్యాః పూర్ణోపమా.

అవ. ఎనుబదియవశ్లోకమున రాజు ప్రమాదపడరాదని చెప్పఁబడినది. దానిక్రమమును జెప్పుచున్నాఁడు.—

బుద్ధిశస్త్రః ప్రకృత్యంగో ఘనసంవృతికంచుకః,
చారేక్షణో దూతముఖః పురుషః కోఽపి పార్థివః. ౮౨

టీ. బుద్ధిశస్త్రః=బుద్ధియే ఆయుధముగాఁ గలవాఁడును, ప్రకృత్యంగః=స్వామి అమాత్యుఁడు మున్నగురాజ్యాంగములే అవయవములుగఁ గలవాఁడును, ఘనసంవృతికంచుకః - ఘన=అభేద్యమైన, సంవృతి=మంత్రగోపనమే, కంచుకః=కవచముగాఁ గలవాఁడును, చారేక్షణః - చార=గూఢచారులే, ఈక్షణః=కన్నులుగాఁ గలవాఁడును, దూతముఖః - దూత=దూతయే, ముఖః=ముఖముగాఁ గలవాఁడును నగు, పార్థివః=రాజు, కోఽపిపురుషః=మఱియొక పురుషుఁడే (లోకవిలక్షణమైనవాఁడు).

తా. బుద్ధి యనుశస్త్రంబు నమోఘంబుగఁ బ్రసరింపఁజేయుచు స్వామి (విచక్షణగల యాజమాన్యము) అమాత్యుఁడు (మంత్రి) సుహృత్తు, కోశము, రాష్ట్రము, దుర్గము, బలము (సైన్యము) అను నీ రాజ్యాంగంబులు శరీరంబుగా వైకల్యమించుకంతయు లేక యితరులకు భేదింపరాని మంత్రగోపనము (ఆలోచన బయల్పడమి) కవచంబుగా రాజ్యభేదము బొందక వేగువాండ్రు కన్నులుగా స్వపరమండలవృత్తాంతంబు లెల్లం గాంచుచు దూత యనుముఖంబున సంధి, విగ్రహాము మున్నగు కార్యములయందు వలయుసంభాషణములు గావించు

కొనుచుఁ దగురీతిని రాజ్యపరిపాలన చేయురాజు లోకోత్తరుం డగు పురుషుండు గాని సామాన్యుండు గాఁడు. అట్లు ప్రవర్తించనిపక్షమున నాత్మహాని యగునని తాత్పర్యము.

శ. స.—బుద్ధిరేవ శస్త్రం యస్యసః బుద్ధిశస్త్రః, శస్త్రః శస్త్రౌ శస్త్రాః బుద్ధిశస్త్రశబ్దః అ. పు. ప్ర. ఏ. ప్రకృతయఏవ అంగాని యస్యసః ప్రకృత్యంగః, అంగః అంగౌ అంగాః ప్రకృత్యంగశబ్దః అ.పు. ప్ర. ఏ. ఘనాచసాసంవృతిశ్చ ఘనసంవృతిః ఘనసంవృతిరేవ కంచుకో యస్యసః ఘనసంవృతికంచుకః, కంచుకః కంచుకౌ కంచుకాః ఘనసంవృతి కంచుకశబ్దః అ. పు. ప్ర. ఏ. చార ఏవ ఈక్షణా యస్యసః చారేక్షణః, ఈక్షణః ఈక్షణౌ ఈక్షణాః చారేక్షణశబ్దః అ. పు. ప్ర. ఏ. దూత ఏవముఖం యస్యసః దూతముఖః, ముఖః ముఖౌ ముఖాః దూతముఖశబ్దః అ. పు. ప్ర. ఏ. పురుషః, పురుషః పురుషౌ పురుషాః పురుషశబ్దః అ. పు. ప్ర. ఏ. కః, కః కౌ కే కింశబ్దః మ.పు.ప్ర.ఏ.అపి అవ్య. పార్థివః,పార్థివః పార్థివౌ పార్థివాః పార్థివశబ్దః అ. పు. ప్ర. ఏ.

ఉపాయమాస్థితస్యేత్యత్ర రాజ్ఞానప్రమాద్యమిత్యుక్తం. అప్రమాదప్రకారమాహ.—

బుద్ధీతి. బుద్ధిరేవ శస్త్రం యస్య సః బుద్ధిశస్త్రః, అమోఘపాతత్వాత్తస్యా ఇతి భావః. ప్రకృతయః స్వామ్యమాత్యాదిరాజ్యాంగాని, 'రాజ్యాంగాని ప్రకృతయ' ఇత్యమరః. తా ఏవాంగాని గాత్రాణి యస్యసః ప్రకృత్యంగః, తద్వైకల్యాద్రాజ్ఞాం వైకల్యా దితి భావః. ఘనా దుర్భేదా, సంవృతి ర్మంత్రగుప్తిరేవ, కంచుకః కవచో యస్య స తథోక్తః, మంత్రభేదే రాజ్యభేదా దితి భావః. చరతీతి చరః, పచాద్యచ్. స ఏవ చారో గూఢపురుషః ప్రజ్ఞాదిత్వా త్స్వార్థేఽణ్ప్రత్యయః. 'చారశ్చ గూఢపురుష' ఇ త్యమరః. స ఏవేక్షణం చక్షు ర్యస్య సః చారేక్షణః, అన్యథా స్వపరమండలవృత్తాంతాదర్శనా దంధస్యేవ పదేపదే వినిపాతా దితి భావః. దూతఏవ ముఖం వాగ్యస్య స దూతముఖః. 'స్యాత్సందేశహరో దూత' ఇ త్యమరః. అన్యథా మూకస్యేవ వాగ్వ్యవహారాసిద్ధౌ తత్సాధ్యసంధ్యాదికార్యప్రతిబంధస్స్యా దితి భావః. ఏవంభూతపార్థివః కోఽపి పురుషః, అన్య ఏ వాయం లోకవిలక్షణః పుమా ని త్యర్థః. అతో రాజ్ఞా సర్వథా బుద్ధ్యాదిసంపన్నేన భవితవ్యం. ఏతదే వాప్రమత్తత్వం, అన్యథా స్వరూపహాని స్స్యా దితి భావః. అత్ర కోఽపీతి రాజ్ఞో లోకసంబంధేఽప్యసంబంధోక్త్యాతద్రూపాతిశయోక్తిః. సా చ బుద్ధిశస్త్ర ఇత్యాదిరూపకనిర్వ్యాఢేతి తేన సహాంగాంగిభావేన సంకరః.

అవ. "చతుర్థోపాయసాధ్యే" యనుశ్లోకము మొదలిడి క్షాత్రమే జూపవలయు నని చెప్పినదానికి ప్రత్యుత్తరము చెప్పు చున్నాఁడు.—

తేజః క్షమా వా నైకాంతః కాలజ్ఞస్య మహీపతేః,
నైక మోజః ప్రసాదో వా రసభావ విదః కవేః. ౮౩

టీ. కాలజ్ఞస్య=సమయమెఱింగిన, మహీపతేః=భూపాలునకు, తేజః=క్షాత్రమేయనియేని,క్షమావా=క్షమయేయనియేని, ఏకాంతః=నియమము, న=లేదు. తథాహి=అదియట్లే, రసభావవిదః శృంగారము మున్నగురసములను నిర్వేదము మున్నగుభావములను నెఱింగిన, కవేః=కవికి, ఏకం=ఒక్క, ఓజః=ఓజోగుణము (సమానబాహుళ్యాదులు గలిగిన ప్రౌఢరచనము) గాని, ఏకః=ఒక్క, ప్రసాదః=ప్రసాదగుణము (సుకరమైనరచనము) గాని, న=(ఆశ్రయింపవలసినదిగా) లేదు.

తా. ఏయేసమయమం దేయేకార్యములఁ జేయవలయునదియు బాగుగా నెఱింగినరాజులకు క్షాత్త్రిధర్మమునే యవలంబింపవలయు నని గాని శాంతియే బూనవలయు నని గాని యొకనియమము లేక సమయోచితముగా నుభయంబు నాశ్రయింపందగు. శృంగారాది రసములను జక్కఁగా గ్రహించి కవిత్వము జెప్పువాఁడు తత్తద్రసానుగుణంబుగ నొక్కొక్కచోట పెద్దపెద్దసమాసములతో ప్రౌఢంబుగను వేఱొక్కచోట చిన్నచిన్న మృదుపదంబులతో సుకుమారంబుగను రచింపఁదగును గాని కేవల ప్రౌఢబంధము గాని కేవల సుకుమారబంధము గాని యెల్లచోట్ల గ్రహింపరాదుగదా.

శ. స.—తేజః, తేజః తేజసీ తేజాంసి తేజశ్శబ్దః స. న. ప్ర. ఏ. క్షమా, క్షమా క్షమే క్షమాః క్షమాశబ్దః ఆ. స్త్రీ. ప్ర.ఏ.వా అవ్య. న అవ్య. ఏకాంతః,ఏకాంతః ఏకాంతౌ ఏకాంతాః ఏకాంతశబ్దః అ. పు. ప్ర.ఏ. కాలం జానాతీతి కాలజ్ఞః తస్య కాలజ్ఞస్య,కాలజ్ఞస్య కాలజ్ఞయోః కాలజ్ఞానాం కాలజ్ఞశబ్దః అ. పు. ష. ఏ. మహ్యాః పతిః మహీపతిః తస్య మహీపతేః, మహీపతేః మహీపత్యోః మహీపతీనాం మహీపతి శబ్దః ఇ. పు. ష. ఏ. న అవ్య. ఏకం ఏకశబ్దః అ. న. ని. ప్ర. ఏ.

ఓజః, ఓజః ఓజసీ ఓజాంసి ఓజశ్శబ్దః స. న. ప్ర. ఏ. ప్రసాదః, ప్రసాదః ప్రసాదౌ ప్రసాదాః ప్రసాదశబ్దః అ. పు. ప్ర. ఏ. వా అవ్య. రసాశ్చ భావాశ్చ రసభావాః రసభావాన్ వేత్తీతి రసభావవిత్ తస్య రసభావ విదః, విదః విదోః విదాం రసభావవిచ్ఛబ్దః ద. పు. ష. ఏ. కవేః, కవేః కవ్యోః కవీనామ్ కవిశబ్దః ఇ. పు. ష. ఏ.

చతుర్థోపాయసాధ్య ఇత్యాదినా యత్ క్షాత్రమేవ కర్తవ్య మిత్యుక్తం తత్రోత్తరమాహ.—

తేజఇతి. కాలం జానాతీతి కాలజ్ఞః, అస్యాయం కాల ఇతి విదుష ఇత్యర్థః. 'ఆతోऽనుపసర్గే క' ఇతి ప్రత్యయః. న 'ప్యసుప తే' త్యాదినా కవిధిః. సమాసే కర్మోపపదస్యైవ బలవత్త్వఖ్యాపనాత్. తస్య మహీపతేః, తేజః క్షాత్రమేవ వేతి వా. క్షమైవేతి వా, ఏకాంతో నియమో నాస్తి, కింతు యథాకాల ముభయ ముపాశ్రయణీయ మిత్యర్థః. తథాహి—రసాన్ శృంగారాదీన్ భవాన్ నిర్వేదాదీంశ్చ, వేత్తీయ స్తస్య రసభావవిదః, భావగ్రహణం సంపాతాయాతం కవేః కవయితుః ఏకం కేవల మోజః, సమాసబాహుళ్యాదినా ప్రౌఢబంధత్వంవా ఏకః ప్రసాదః సుకుమారబంధత్వంవా నకింతు తత్తద్రసానుగుణ్యేన యథాయోగ ముభయమప్యుపాదేయం. దృష్టాంతాలంకారః.

అవ. "మాటిమాటికి మహాపకారము చేయుచుండువాని నెవ్వరు క్షమింతు" రని చెప్పిన దానికి ప్రత్యుత్తరము జెప్పుచున్నాఁడు.—

కృతాపచారోఽపి పరై రనావిష్కృతవిక్రియః,
అసాధ్యః కురుతే కోపం ప్రాప్తే కాలే గదో యథా. ౮౪

టీ. పరైః=శత్రువులచేత, కృతాపచారోఽపి = చేయఁబడిన యపకారము (అపథ్యము) కలవాఁడయినను, అనావిష్కృతవిక్రియః- అనావిష్కృత=బయల్పడనీయని (లోఁ నణఁచఁబడిన), విక్రియః=వికారముగలవాఁడు గనుకనే, అసాధ్యః = సాధింప శక్యముఁగానివాఁడై, గదోయథా = రోగమట్లు, కాలే=(బలము క్షీణమగు) సమయము, ప్రాప్తే=వచ్చినప్పుడు, కోపం = కోపమును, కురుతే=చేయును (ప్రకోపించును).

తా. వ్యాధిగ్రస్తుఁడు లక్ష్యపెట్టక యపథ్యము చేసినను బలిష్ఠుఁడుగా నున్నంతమట్టుకు రోగ వికారములు బయల్పడ కుండ లోపల నణఁగియుండి మందులకు సాధ్యపడక శరీరమున బల ముడిగినప్పు

డెల్ల ప్రకోపించి యావజ్జీవము నలియబెట్టునట్లు ప్రాజ్ఞుఁడు శత్రు వప కారము చేసినను గ్రోధవికారమును బయల్పడనీయకుండ నోపికపట్టి యుండి శత్రువున కసాధ్యుఁడై వానికి బలక్షయకాలము రా వేగమే విజృంభించి వానిఁ ద్రుంచునని తాత్పర్యము.

శ. స.—కృతః అపచారః యస్యసః కృతాపచారః, అపచారః అపచారౌ అపచారాః కృతాపచారశబ్దః అ. పు. ప్ర. ఏ. అపి అవ్య. పరేణ,పరేణ పరాభ్యాం పరైః పరశబ్దః అ.పు.తృ.బ.న. ఆవిష్కృతా అనావిష్కృతా అనావిష్కృతా విక్రియా యేనసః అనావిష్కృత విక్రియః, విక్రియః విక్రియౌ విక్రియాః అనావిష్కృత విక్రియశబ్దః అ. పు. ప్ర. ఏ. సాధితుం శక్యః సాధ్యః నసాధ్యః, అసాధ్యః, అసాధ్యః అసాధ్యౌ అసాధ్యాః అసాధ్యశబ్దః అ. పు. ప్ర. ఏ. కురుతే కుర్వాతే కుర్వతే డుకృఞ్ కరణ ఇత్యస్మాత్సకర్మకాత్కర్తరి వర్తమా నేలటి ఆత్మ ప్ర. పు. ఏ. కోపం, కోపం కోపౌ కోపాన్ కోపశబ్దః అ. పు. ద్వి. ఏ. ప్రాప్తే, ప్రాప్తే ప్రాప్తయోః ప్రాప్తేషు ప్రాప్తశబ్దః అ. పు. స. ఏ. కాలే, కాలే కాలయోః కాలేషు కాలశబ్దః అ. పు. స. ఏ. గదః, గదః గదౌ గదాః గదశబ్దః అ. పు. ప్ర. ఏ. యథా అవ్య.

యదుక్తం క్రియాసమభిహారేణ విరాధ్యంతం క్షమేత క ఇతి త త్రోత్తర మాహ.—

కృతేతి. పరైః శత్రుభిః, కృతః అపచారః అపకారః అపథ్యం చ యస్య సః, తథా ప్యనావిష్కృతవిక్రియః అంతర్గూఢవికారః, అతఏ వాసాధ్యః అప్రతిసమాధే యస్సన్, గదోయథా రోగఇవ, 'ఇవవ ద్వా యథాశబ్ద' ఇతి దండీ. కాలే బలక్షయా వసరే, ప్రాప్తేసతి, కోపం కురుతే, ప్రకుప్యతీత్యర్థః. తదుక్తం 'ఏహీ దమిత్రం స్కంధేన యావత్కాలవిపర్యయః, త మేన చాగతే కాలే భింద్యా ద్ఘట మి వాశ్మనేతి.

అవ. ఇందువలనను క్షమించవలయునని చెప్పుచున్నాఁడు.—

మృదు వ్యవహితం తేజో భోక్తు మర్థా న్ప్రకల్పతే,
ప్రదీప స్స్నేహ మాదత్తే దశ యాభ్యంతరస్థయా. ౮౫

టీ. మృ...తం-మృదు=మెత్తనిదానిచేత, వ్యవహితం=మఱుఁగుపడిన, తేజః=ప్రతాపము,అర్థాన్=ప్రయోజనములను, భోక్తుం=అనుభవించుటకు,ప్రకల్పతే=సమర్థమగును. తథాహి=అట్లెగదా. ప్రదీపః=

దీపము, అభ్యంతరస్థయా=మధ్యనున్న, దశయా = వ_ర్తిచేత, స్నేహం =చమురును, ఆద_త్తే=అందుకొనుచున్నది.

తా. ప్రతాపము శాంతిపూర్వక మైననే ప్రయోజనకారి యగును. గావున ముందు క్షమింపవలయును. దీపము వ_ర్తితోఁగూడియే గదా చమురునందుకొని చక్కఁగా వెలుంగును.

శ. స.—మృదునా వ్యవహితం మృదువ్యవహితం, వ్యవహితం వ్యవహితే వ్యవహితాని మృదువ్యవహితశబ్దః అ. న. ప్ర. ఏ. తేజః, తేజః తేజసీ తేజాంసి తేజశ్శబ్దః స. న. ప్ర. ఏ. భోక్తుం తుమున్నంతమవ్య. అర్థం, అర్థం అర్థౌ అర్థాన్ అర్థశబ్దః అ. పు. ద్వి. ఏ. ప్రకల్పతే ప్రకల్పేతే ప్రకల్పంతే ప్రపూర్వకకృపూసామర్థ్యే ఇత్యస్మాదకర్మకాద్ధాతోః కర్తరి వ_ర్తమానేలటి ఆత్మ. ప్ర.పురు.ఏ. ప్రదీపః, ప్రదీపః ప్రదీపౌ ప్రదీపాః ప్రదీపశబ్దః అ.పు.ప్ర.ఏ. స్నేహం, స్నేహం స్నేహౌ స్నేహాన్ స్నేహశబ్దః అ. పు. ద్వి. ఏ. ఆద_త్తే ఆదదాతే ఆదదతే ఆఙ్పూర్వకడుదాఞ్ దాన ఇత్యస్మాత్సకర్మకాత్క_ర్తరి వ_ర్తమానేలటి ఆత్మ.ప్ర. పురు. ఏ. దశయా, దశయా దశాభ్యాం దశాభిః దశాశబ్దః ఆ. స్త్రీ. తృ. ఏ. అభ్యంతరే తిష్ఠతీ త్యభ్యంతరస్థా తయా అభ్యంతరస్థయా, అభ్యంతరంతస్థయా అభ్యంతరస్థాభ్యాం అభ్యంతరస్థాభిః అభ్యంతరస్థాశబ్దః ఆ. స్త్రీ. తృ. ఏ.

ఇతశ్చ క్షంతవ్య మిత్యాహ.—

మృద్వితి. మృదునా వస్తునా, వ్యవహిత మంతర్హితం తేజః, అర్థాన్ భోక్తుం ప్రకల్పతే ప్రభవతి, తథాహి ప్రదీపః అభ్యంతరస్థయా, మధ్యస్థయా, దశయా వర్త్యా, స్నేహం తైలాదిక మాద_త్తే, అన్యథా స్వయమేవ నశ్యేదితి. తతః శాంతిపూర్వకమేవ శాత్త్రం ఫలతీతి సర్వథా ప్రథమతః క్షంతవ్య మితి భావః. 'దశా వర్త్యా మవస్థాయాం స్నేహ స్తైలాదికేరస' ఇతి చ విశ్వః. విశేషేణ సామాన్యసమర్థనా దర్థాంతరన్యాసః.

అవ. అట్లయినఁ బౌరుషములేకయే పోవుఁగాక ఎల్లప్పుడు నోరిమి గలవానికి దైవమే శ్రేయస్సుల నీఁగలడందురని తలఁచి చెప్పుచున్నాఁడు.—

నాలంబతే దైష్టికతాం న నిషీదతి పౌరుషే,
శబ్దార్థౌ సత్కవి ర్త్రివ ద్వయం విద్వా నపేక్షతే. ౮౬

టీ. విద్వాన్=ఎఱుకగలవాఁడు, దైష్టికతాం=అదృష్టముప్రధానమనుతలంపును, నాలంబతే= ఊఁతకొనఁడు (ఆశ్రయించఁడు), పౌరుషే=పురుషప్రయత్నమందుమాత్రమే, ననిషీదతి= ఉండదు. కింతు= ఇఁకనేమన, సత్కవిః=చక్కఁగా కవిత్వముచెప్పువాఁడు, శబ్దార్థావివ= శబ్దార్థములనుంబోలె, ద్వయం=దైవపురుషకారముల రెంటిని, అపేక్షతే=కోరును.

తా. బుద్ధిమంతుఁడు విధి యెట్లున్నదో అట్లగునని దైవమును మాత్రమే ప్రమాణముగా నమ్మి యూరకుండఁడు. అట్లూరకుండిన నశించును. కేవలపురుషకారమే సర్వార్థసాధకమనియు నభిమానించఁడు. అట్లభిమానించినను దైవానుకూల్యము లేనిచో పురుషకారము విఫలమగును. ఇంక సత్కవి కవిత్వమున కావ్యశరీరము లగుశబ్దార్థముల రెంటినింగూడ నుపచరించునట్లు పరస్పరసంబంధము గల దైవపురుషకారములను రెంటినిఁగూడ గార్యసాధనముగాఁ గైకొనును. ఇట్లు పౌరుషము గూడ నావశ్యకమ యయ్యును సమయమందే ప్రయోగించవలయు నని భావము.

శ. స.—న అవ్య. ఆలంబతే ఆలంబేతే ఆలంబంతే ఆఙ్పూర్వకరబి లబి అబిశబ్దే లబిఅవస్రంసనేచ ఇత్యస్మాత్సకర్మకాద్ధాతోః కర్తరి వర్తమానేలటి ఆత్మ ప్ర. పురు. ఏ. దిష్టమితిమతిర్యస్యసః దైష్టికః దైష్టికస్యభావః దైష్టికతా తాం దైష్టికతాం, దైష్టికతాం దైష్టికతే దైష్టికతాః దైష్టికతాశబ్దః ఆ. స్త్రీ. ద్వి. ఏ. న అవ్య. నిషీదతి నిషీదతః నిషీదంతి నిపూర్వకషద్లవిశరణగత్యవసాదనేషు ఇత్యస్మాదకర్మకాద్ధాతోః కర్తరి వర్తమానేలటి పర. ప్ర. పురు. ఏ. పురుషస్య కర్మ పౌరుషం తస్మిన్ పౌరుషే, పౌరుషే పౌరుషయోః పౌరుషేషు పౌరుషశబ్దః అ. న. స. ఏ. శబ్దశ్చ అర్థశ్చ శబ్దార్థౌ తౌ శబ్దార్థౌ శబ్దార్థశబ్దః అ. పు. ని. ద్వి. ద్వి. సత్ సమ్యక్ కవతఇతి సత్కవిః (కవతే= చాతుర్యేణ వర్ణయతీతి కవిః సంశ్చాసౌ కవిశ్చ సత్కవిః) కవిః కవీ కవయః కవిశబ్దః ఇ. పు. ప్ర.

ఏ. ఇవ అవ్య. ద్వయం,ద్వయం ద్వయే ద్వయాని ద్వయశబ్దః అ.న.ద్వి. ఏ. వేత్తీతి విద్వాన్, విద్వాన్ విద్వాంసౌ విద్వాంసః విద్వచ్ఛబ్దః స.పు. ప్ర. ఏ. అపేక్షతే అపేక్షేతే అపేక్షంతే అపపూర్వక ఈక్షదర్శన ఇత్యస్మాత్సకర్మకాద్ధాతోః కర్తరి వర్తమానేలటి ఆత్మ. ప్ర. పురు. ఏ.

తర్హి పౌరుషమేవ మాభూత్ నిత్యం క్షమమాణస్య దైవమేవ శ్రేయో విధాస్యతీత్యాశంక్యాహ.—

నాలంబత ఇతి. విద్వాన్ అభిజ్ఞః, దిష్టం మతిరస్యేతి దైష్టికః, దైవప్రమాణక ఇత్యర్థః. 'దైవం దిష్టం భాగధేయ' మిత్యమరః. 'అస్తినాస్తిదిష్టంమతిః' ఇతి ఠక్. తద్భావం దైష్టికతా, తామేవ, నాలంబతే, సర్వథా తద్భవిష్యస్య వినాశాదితి భావః. తథా పౌరుషే కేవలం పురుషకారే, యువాదిత్వా దణ్ప్రత్యయః. నసీదతి నతిష్ఠతి, దైవప్రాతికూల్యే తస్య వైఫల్యాదితి భావః. కింతు సత్కవిః సమ్యక్కవయితా, శబ్దార్థావివ, తయోః కావ్యశరీరత్వాదితి భావః. యథాహ వామనః—'అదోషౌ సగుణౌ సాలంకారౌ శబ్దార్థౌ కావ్య' మితి. ద్వయం దైవం పౌరుషం చాపేక్షతే, అతః పౌరుషమప్యావశ్యకమేవ, కింతు కాలే కర్తవ్యమితి విశేషః, పౌరుషాదృష్టయోః పరస్పరసాపేక్షత్వాదితి భావః. ఉపమాలంకారః.

అవ. ఇంక నోరిమివలనిలాభమును జెప్పుచున్నాఁడు.—

స్థాయినోఽర్థే ప్రవర్తంతే భావా స్సంచారిణో యథా,
రసస్యైకస్య భూయాంస స్తథా జేతు ర్మహీభృతః. ౮౭

టీ. రసస్య=శృంగారాదిరసముయొక్క (సిద్ధికొఱకు,) స్థాయినః=స్థాయిభావముయొక్క, ఏకస్య=ఒక్కదానియొక్కయే, అర్థే=(రుచిపుట్టించుటయను) ప్రయోజనమువిషయమై, భూయాంసః=అనేకములగు, సంచారిణః=వ్యభిచారులగు, భావాః=నిర్వేదాది భావములు (విభావాదులును), యథా = ఎట్లు, ప్రవర్తంతే=ప్రవర్తిల్లుచున్నవో, తథా= అట్లు,స్థాయినః=స్థిరుఁడై (యోర్చుచుండిన), ఏకస్య=ఒకఁడైన, జేతుః= విజిగీషు వగు రాజునకు,భూయాంసః=అనేకులు, మహీభృతః=రాజులు, ప్రవర్తంతే=తోడ్పడుదురు. వేఱొకవ్యాఖ్యానము:— స్థాయినః = స్థిరమైన, ఏకస్య=ముఖ్యమైన, రసస్య=రసముయొక్క, అర్థే=ప్రయోజనమునందు, సంచారిణః=ప్రసంగవశమున వచ్చినయితరరసములు, యథా ప్రవర్తంతే - (తక్కినది సమానము).

తా. విభావానుభావసాత్త్వికభావవ్యభిచారిభావములు, రతి, హాసము, శోకము, క్రోధము, ఉత్సాహము, భయము, జుగుప్స, విస్మయము, శమము ననుస్థాయిభావములలో నొకొక్కదానియందు మాధుర్యమును నింపుచు శృంగారాదిరసములసిద్ధికి తోడ్పడునట్లు శాంతి గలిగి తగినసమయమును నిరీక్షించుచు స్థిరుఁడై యున్న రాజునకు విజయము సిద్ధింపఁ జాలమంది రాజులు తోడ్పడుదురు. కావున క్షమింపఁదగునని భావము.

శ. స.—స్థాయినః, స్థాయినః స్థాయినోః స్థాయినామ్ స్థాయిశబ్దః న.పు.ష.ఏ. అర్థే, అర్థే అర్థయోః అర్థేషు అర్థశబ్దః అ.పు. స. ఏ. ప్రవర్తతే ప్రవర్తేతే ప్రవర్తంతే ప్రపూర్వకవృతువర్తన ఇత్యస్మాదకర్మకాద్ధాతోఃకర్తరి వర్తమానేలటి ఆత్మ. ప్ర. పురు. బ. భావః, భావః భావౌ భావాః భావశబ్దః అ. పు. ప్ర. బ. సంచరంతీతి సంచారిణః, సంచారీ సంచారిణౌ సంచారిణః సంచారిశబ్దః న. పు.ప్ర.బ. యథా అవ్య. రస్యతఇతి రసః తస్య రసస్య, రసస్య రసయోః రసానాం రసశబ్దః అ.పు. ష.ఏ. ఏకస్య ఏకశబ్దః అ. పు. ని. ష. ఏ. అత్యంతంబహవః భూయాంసః, భూయాన్ భూయాంసౌ భూయాంసః భూయశ్శబ్దః స. పు. ప్ర.బ. తథా అవ్య. జేతుః, జేతుః జేత్రోః జేతౄణాం జేతృశబ్దః ఋ. పు. ష. ఏ. మహీం బిభ్రతీతి మహీభృతః, భృత్ భృతౌ భృతః మహీభృచ్ఛబ్దః త. పు. ప్ర. బ.

అథ క్షాంతేః ఫల మాహ.—

స్థాయినయితి. రస్యతే స్వాద్యత ఇతి రసః శృంగారాదిః. 'రసతే స్వాదనార్థత్వాద్రస్యంత ఇతి తే రసా' ఇతి నిర్వచనాత్. తస్య రసస్య సిద్ధయే, స్థాయినః స్థాయిభావస్య రత్యాదేః. 'రతి ర్హాసశ్చ శోకశ్చ క్రోధోత్సాహౌ భయం తథా, జుగుప్సావిస్మయశమాః స్థాయిభావాః ప్రకీర్తితా' ఇతి వచనాత్. తస్యైకస్యైవార్థే (స్వామస్థాయి) భావరూపే, ప్రయోజనే భూయాంసః సంచారిణః వ్యభిచారిణో భావాః నిర్వేదాదయః. విభావాదీనా మప్యుపలక్షణమేతత్. యథాప్రవర్తంతే తదుక్తం—'విభావై రనుభావైశ్చ సాత్త్వికై ర్వ్యభిచారిభిః,ఆనీయమానః స్వాద్యత్వం స్థాయీభావో రసః స్మృత'ఇతి తథా స్థాయినః స్థిరస్య, క్షాంత్యా కాలం ప్రతీక్షమాణస్యేత్యర్థః. తస్యైకస్య జేతుః విజిగీషో ర్నాయకస్య, అర్థే ప్రయోజనే, భూయాంసో మహీభృతో రాజానః ప్రవర్తంతే స్వయమేవతస్య కార్యం సాధయంతీ

త్యర్థః..అతః క్షన్తవ్య మితి భావః. కేచిత్తు భావశబ్దస్యాపి రసపరత్వ మాశ్రిత్య యథా సంచారిణః ప్రసంగా దాగంతుకాః అన్యే రసాః స్థాయినః స్థిర స్యైకస్య ముఖ్యస్య రస స్యార్థే ప్రవర్తంతే, య థాస్మిన్నేవ కావ్యే వీరస్య శృంగారాదయ ఇతి వ్యాచక్షతే ఉపమాలంకారః.

అవ. శాంతిపక్షమున నేమతి యొక్క గుణమును జెప్పుచున్నాఁడు.—

తంత్రావాపవిదా యోగై ర్మండలా న్యధితిష్ఠతా,
సునిగ్రహా నరేంద్రేణ ఫణీంద్రా ఇవ శత్రవః. ౮౮

టీ. తంత్రావాపవిదా - తంత్ర=స్వరాష్ట్రచింతనమును (శాస్త్రమును), ఆవాప = పరరాష్ట్రచింతనమును (ఔషధప్రయోగమును), విదా=గుఱుతెఱిఁగినట్టియు, యోగైః=(సామాది) ఉపాయములచేత (దేవతాధ్యానములచేత), మండలాని=స్వపరరాష్ట్రములను (మహేంద్రాది దేవతాస్థానములను), అధితిష్ఠతా=ఆక్రమించుచున్న, నరేంద్రేణ=రాజుచేత (విషవైద్యునిచేత), శత్రవః=శత్రువులు, ఫణీంద్రా ఇవ=పాములట్లు, సునిగ్రహాః=సుఖముగా నిరాకరింప నగుదురు.

తా. విషవైద్యుఁడు మంత్రశాస్త్రమును ఔషధప్రయోగమును గుర్తెఱిఁగి దేవతాధ్యానములచే దేవళములయందుండినవాఁడై యవలీలగా నాగుబాములను సాధించగలిగినట్లు రాజు తనరాజ్యముయొక్కయు పరరాష్ట్రముయొక్కయు స్థితిగతులను చక్కఁగాఁదెలిసికొని సామాద్యుపాయములచేఁ బరరాష్ట్రముల నాక్రమించి శత్రువుల నవలీలగా నిరాకరించి జయించును.

శ. స.—తంత్రంచ ఆవాపశ్చ తంత్రావాపౌ తంత్రావాపౌ వేత్తీతి తంత్రావాపవిత్ తేన తంత్రావాపవిదా, విదా విద్భ్యాం విద్భిః తంత్రావాపవిచ్ఛబ్దః ద. పు. తృ. ఏ. యోగేన యోగాభ్యాం యోగైః యోగశబ్దః అ.పు.తృ.బ. మండలం,మండలం మండలే మండలాని మండలశబ్దః అ. న. ద్వి.బ. అధితిష్ఠతా, అధితిష్ఠతా అధితిష్ఠద్భ్యాం అధితిష్ఠద్భిః అధితిష్ఠశబ్దః త. పు. తృ. ఏ. సుఖేన నిగ్రహీతుం శక్యాః సునిగ్రహాః, సునిగ్రహః సునిగ్రహౌ సునిగ్రహాః సునిగ్రహశబ్దః అ.పు. ప్ర. బ. నరాణా మింద్రః నరేంద్రః తేన నరేంద్రేణ, నరేంద్రేణ

నరేంద్రాభ్యాం నరేంద్రైః నరేంద్రశబ్దః అ. పు. తృ. ఏ. ఫణాః ఏషాం సంతీతి ఫణినః ఫణినాం ఇంద్రాః ఫణీంద్రాః, ఫణీంద్రః ఫణీంద్రా ఫణీంద్రాః ఫణీంద్రశబ్దః అ. పు. ప్ర. బ.ఇవ అవ్య. శత్రుః, శత్రుః శత్రూ శత్రవః శత్రుశబ్దః ఉ. పు. ప్ర. బ.

క్షాంతిపక్ష ఏవ గుణాంతర మాహ.—

తంత్రేతి. తంత్రావాపౌ స్వపరరాష్ట్రచింతే, అన్యత్ర తంత్రం శాస్త్రం ఆవాప మౌషధప్రయోగంచ, వేత్తీయ స్తేన తంత్రావాపవిదా, 'తంత్రః స్వరాష్ట్రచింతాయా మావాపః పరచింతనే, శాస్త్రౌషధాంతముఖ్యేషు తంత్ర మి'తి వైజయంతీ. యోగైస్సా మాద్యుపాయైః, అన్యత్ర దేవతాధ్యానైశ్చ, 'యోగస్సన్నహనోపాయధ్యానసంగతి యుక్తిషి' త్యమరః. మండలాని స్వపరరాష్ట్రాణి, మహేంద్రాదిదేవతాయతనానిచ, అధితిష్ఠతా ఆక్రమతా, నరేంద్రేణ రాజ్ఞా విషవైద్యేనచ, 'నరేంద్రః పార్థివే రాజ్ఞి విషవైద్యే చ కథ్యత' ఇతి విశ్వః. శత్రవః ఫణీంద్రాఇవ, సునిగ్రహాః సుఖేన నిగ్రాహ్యాః, ఏష చ ప్రకృతా ప్రకృతవిషయ శ్శ్లేషః. ఉపమై వేతి కేచిత్.

అవ. ప్రభుశక్తికి మంత్రోత్సాహశక్తులు మూలమని " ప్రజ్ఞోత్సాహ" అనుశ్లోకమునఁ జెప్పఁబడియె. దానినే స్ఫుట పఱచుచున్నాఁడు.—

కర ప్రచేయా ముత్తుంగః ప్రభుశక్తిం ప్రథీయసీమ్,
ప్రజ్ఞాబలబృహన్మూలః ఫల త్యుత్సాహపాదపః. ౮౯

టీ. ఉత్తుంగః=అత్యున్నతమైన, ప్రజ్ఞాబలబృహన్మూలః-ప్రజ్ఞాబల=మంత్రశక్తియే, బృహన్మూలః=తల్లివేరుగాఁగలిగిన, ఉత్సాహపాదపః=ఉత్సాహశక్తియనువృక్షము, కరప్రచేయాం, కర=కప్పముచేత. (చేతితో), ప్రచేయాం= పెంపొందింపఁబడఁదగిన (అందుకొనఁదగిన) ప్రథీయసీమ్=మిగులగొప్పదియగు, ప్రభుశక్తిం=ప్రభుశక్తిని (కోశదండములవలనఁ గలిగిన తేజస్సు=ప్రభావము) ఫలతి=ఫలించును (పుట్టించును).

తా. ఉత్సాహశక్తియను మహోన్నతవృక్షము మంత్రశక్తియే ముఖ్యమైన తల్లివేరుగా నొప్పారు. అయ్యది ప్రభుశక్తియను మహాఫలమును ఫలించును. అనఁగా ఉత్సాహము మంత్రపూర్వకమైననే కార్య

సిద్ధిని గూర్చి ఫలవ త్తరమగును. అట్లుగానిచో వేరు తెగఁగొట్టిన చెట్టు వలె క్షయించునని తాత్పర్యము.

శ. స.—ప్రచేతుం యోగ్యా ప్రచేయా కరేణ ప్రచేయా కర ప్రచేయా తాం కరప్రచేయాం, ప్రచేయాం ప్రచేయే ప్రచేయాః కరప్ర చేయాశబ్దః ఆ. స్త్రీ. ద్వి. ఏ. ఉత్తుంగః, ఉత్తుంగః ఉత్తుంగౌ ఉత్తుంగాః ఉత్తుంగశబ్దః అ. పు. ప్ర. ఏ. ప్రభోశ్శక్తిః ప్రభుశక్తిః తాం ప్రభుశక్తిం, శక్తిం శక్తీ శక్తీః ప్రభుశక్తిశబ్దః ఇ.స్త్రీ.ద్వి.ఏ. అత్యంతం పృథ్వీ. ప్రథీ యసీ తాం ప్రథీయసీం, ప్రథీయసీం ప్రథీయస్యౌ ప్రథీయసీః ప్రథీయ సీశబ్దః ఈ. స్త్రీ. ద్వి. ఏ. ప్రజ్ఞాయా బలం ప్రజ్ఞాబలం బృహచ్చ తత్ మూలంచ బృహన్మూలం ప్రజ్ఞాబలమేవ బృహన్మూలం యస్యసః ప్ర జ్ఞాబలబృహన్మూలః, మూలః మూలౌ మూలాః ప్రజ్ఞాబలబృహన్మూ లశబ్దః అ. పు. ప్ర. ఏ. ఫలతి ఫలతః ఫలంతి ఫలనిష్పత్తా విత్యస్మా త్సకర్మకాద్ధాతోః కర్తరి వర్తమానేలటి పర ప్ర. పురు. ఏ. పాదైః పిబ తీతి పాదపః ఉత్సాహ ఏవపాదపః ఉత్సాహ పాదపః, పాదపః పాదపౌ పాదపాః ఉత్సాహపాదపశబ్దః అ. పు. ప్ర. ఏ.

ప్రజ్ఞోత్సాహ ఇతః స్వామిత్య త్రైత్రా వేవ ప్రభుశక్తే ర్మూల మి త్యుక్తం తదేవ వ్యనక్తి.—

కరేతి. ఉత్తుంగో మహోన్నతః, ప్రజ్ఞాబలం మంత్రశక్తిరేవ, బృహ త్ప్రధానం మూలం యస్య సః, ఉత్సాహఏవ పాదపః, కరేణ బలినా, ప్రచేయాం వర్ధనీయాం హస్తగ్రాహ్యాంచ, 'బలిహస్తాంశవః కరా' ఇత్యమరః. ప్రథీయసీం పృథుతరాం, 'ర ఋతోహలాదేర్లఘోః' రితి రేఫాదేశః ప్రభుశక్తిం తేజోవిశేషం, 'సప్రభావః ప్రతా పశ్చ యత్తేజః కోశదండజ మి'త్యమరః. ఫలతి ప్రసూత ఇత్యర్థః, ఫలనిష్పత్తౌ మంత్ర పూర్వక ఏవోత్సాహ స్స్వతః ఫలతి విపరీతస్తు ఛిన్నమూలో వృక్ష ఇవ శుష్యతీతి భావః. రూపకాలంకారః.

అనల్పత్వా త్ప్రధానత్వా దంశస్యే వేతరేస్వరాః,
విజిగీషో ర్నృపతయః ప్రయాంతి పరివారతామ్. ౯౦

టీ. అనల్పత్వాత్=ప్రజ్ఞోత్సాహములఁ గొఱఁతలేని వాఁడు గనుకనే (ఉచ్చైస్స్వరమగుటవలనను), ప్రధానత్వాత్=మండలనాయ కుఁడగుటవలన (నాయకస్వరమగుట వలనను), అంశస్య=అంశవాఁ

స్వరమునకు, ఇత రే=తక్కిన, స్వరాఇవ=(షడ్జాది) స్వరములుంబోలె, విజిగీషోః = జయింపనిచ్ఛగించు నాయకునకు, నృపతయః=(మధ్యమండలమునందు) రాజులు, పరివారతాం = బలఁగపుఁదనమును, ప్రయాంతి=పొందుదురు.

తా. ఉచ్చస్వరమై ప్రయోగములయందు బహుళమయి గాన విద్యయందలి స్వరములకెల్ల నాయకస్వరమైన వాది స్వరమనంబరఁగు నంశస్వరమునకు షడ్జాదిస్వరములన్నియు నంగములయి తోడ్పడునట్లు మంత్రోత్సాహ సంపత్తి గలిగి మించి మండలాధీశ్వరుండై విజిగీషువగు రాజునకు తక్కిన మధ్యమండల మందలి రాజులందఱు ననుచరులై తోడ్పడి యాతనికార్యమును నెఱవేర్తురు.

శ. స.—న అల్పః అనల్పః అనల్పస్య భావః అనల్పత్వం తస్మాత్ అనల్పత్వాత్, అనల్పత్వాత్ అనల్పత్వాభ్యాం అనల్పత్వేభ్యః అనల్పత్వశబ్దః అ. న. పం. ఏ. ప్రధానస్య భావః ప్రధానత్వం తస్మాత్ ప్రధానత్వాత్, ప్రధానత్వాత్ ప్రధానత్వాభ్యాం ప్రధానత్వేభ్యః ప్రధానత్వశబ్దః అ.న.పం.ఏ.అంశస్య,అంశస్య అంశయోః అంశానాం అంశశబ్దః అ.పు.ష.ఏ.ఇవ అవ్య. ఇతరః,ఇతరః ఇతరౌ ఇతరే ఇతరశబ్దః అ.పు.ప్ర.బ. స్వరః,స్వరః స్వరౌ స్వరాః స్వరశబ్దః అ. పు. ప్ర. బ. విజేతుమిచ్ఛుః విజిగీషుః తస్యవిజిగీషోః, విజిగీషోః విజిగీష్వోః విజిగీషూణాం విజిగీషుశబ్దః ఉ. పు. ష. ఏ. నౄణాంపతయః నృపతయః, నృపతిః నృపతీ నృపతయః నృపతిశబ్దః ఇ. పు. ప్ర. బ. ప్రయాతి ప్రయాతః ప్రయాంతి ప్రపూర్వకయా ప్రాపణఇత్యస్మాత్సకర్మకాద్ధాతోః కర్తరి వర్తమానే లటి పర ప్ర. పు. బ. పరివారస్య భావః పరివారతా తాం పరివారతాం, పరివారతాం పరివారతే పరివారతాః పరివారతాశబ్దః ఆ. స్త్రీ. ద్వి. ఏ.

అనల్పత్వాదితి. అనల్పత్వాత్ప్రజ్ఞోత్సాహాధికత్వాత్, అతఏవ, ప్రధానత్వాత్, మండలనాయకత్వాత్, అన్యత్ర అనల్పత్వాత్, ఉచ్చైస్స్వరత్వాత్, ప్రయోగబహుళత్వాత్, ప్రధానత్వాత్, నాయకస్వరత్వాచ్చ, అంశస్య అంశస్వరస్య, వాదిస్వరస్యేత్యర్థః. 'యో రక్తివ్యంజకో గేయే యత్సంవాద్యనువాదినా, అమాత్యో బహుళో యస్మాత్ త్రాగో మంద్రవ్యవస్థితిః. యస్త్వాయం యస్య సంవాదీ చానువాదీ స్వరోఽ

పరః, న్యాసోపన్యాసవిన్యాస సన్న్యాసగ్రహతాంగతః. ప్రయోగే బహుళ స్సస్యా ద్వాద్యంశే యోగ్యతాదరా' వితి రత్నాకరేఽభిధానాత్. ఇతరే సర్వాః షడ్జాదయ ఇవ, విజిగీషో ర్నాయకస్య, నృపతయో మధ్యమండలవర్తినో రాజానః, పరివారతాం శేషతాం ప్రయాంతి, తత్కార్యమేవ సాధయంతీత్యర్థః. తస్మాద్విమృశ్యకర్తవ్యమితి తాత్పర్యార్థః. అంశస్వరలక్షణం చ రత్నాకరఏవ 'యోరక్తి' త్యాది నోక్తమేవ నిష్కృష్యోక్తం బహుళత్వం ప్రయోగేషు విశేషవ్యాపకత్వమంశలక్షణ మితి శేష శేషిభావ శ్చైషాంత త్రైవోద్దేశలక్షణోక్తిపూర్వకం స్ఫుటీకృతః. 'చతుర్విధా స్స్వరా వాదీ సంవాదీ చ వివాద్యపి, అనువాదీ చ వాదీతు ప్రయోగే బహుళ స్స్వరః శ్రుతయో ద్వాదశాష్టౌ వా యయో రంతరగోచరాః, మిథ స్సంవాదినౌ తౌ స్తాం విధానస్య వివాదినా. విధయో రేవ వా స్యాతాం తౌ తయో ర్వ్యా విధావపి, శేషాణా మనువాదిత్వం వాదీ రాజాత్ర గీయతే. సంవాదీ త్వనుసారిత్వా ద స్యామాత్యో విధీయతే, వివాదీ విపరీతత్వా ద్ధీరై ర్భృత్యో రిపూపమః, నృపామాత్యానుసారిత్వా దనువాదీ తు భృత్యవ' దితి.

అ ప్యనారభమాణస్య విభో రుత్పాదితాః పరైః,
వ్రజంతి గుణతా మర్థాః శబ్దా ఇవ విహాయసః. ౮౧

టీ. అనారభమాణస్యాఽపి=తానేమియు యత్నించనివాఁడయినను, విభోః=ప్రభువునకు (వ్యాపకమయిన), పరైః=ఇతరుల (గురాజుల)చేత, (శంఖము భేరిమొదలగువానిచేత,) ఉత్పాదితాః=సంపాదింపఁబడిన (పుట్టింపఁబడిన), అర్థాః=ప్రయోజనములు, విహాయసః=ఆకాశమునకు, శబ్దాఇవ=శబ్దములవలె, గుణతాం=విశేషత్వమును (గుణమగుటను), వ్రజంతి=పొందుచున్నవి.

తా. శంఖభేర్యాదుల వలన పుట్టినశబ్దములు కదలక మెదలక సర్వవ్యాపకమైయుండు నాకాశమునకు గుణములైనట్లు, రాజు తానుదాసీనుఁడుగా నుండినను తనమహిమంబుచేత నితర రాజులు సంపాదించిన సర్వార్థములును తనవియేయగును.

శ. స.—అపి అవ్య. ఆరభతఇత్యారభమాణః న ఆరభమాణః అనారభమాణః తస్య అనారభమాణస్య, అనారభమాణస్య అనారభమాణయోః అనారభమాణానాం అనారభమాణశబ్దః అ. పు. ష. ఏ. విభోః, విభోః విభ్వోః విభూనాం విభుశబ్దః ఉ. పు. ష. ఏ. ఉత్పాదితః

ఉత్పాదితః ఉత్పాదితౌ ఉత్పాదితాః ఉత్పాదితశబ్దః అ.పు.ప్ర.బ.పరైః, పరేణ పరాభ్యాం పరైః పరశబ్దః అ.పు.తృ.బ.వ్రజతి వ్రజతః వ్రజంతి వజ వ్రజగతా విత్యస్మాత్సకర్మకాద్ధాతోః కర్తరి వర్తమానేలటి పర.ప్ర.పురు. బ.గుణస్యభావః గుణతా తాం గుణతాం, గుణతాం గుణతే గుణతాః గుణతాశబ్దః ఆ.స్త్రీ.ద్వి.ఏ. అర్థః, అర్థః అర్థౌ అర్థాః అర్థశబ్దః అ.పు. ప్ర.బ.శబ్దః,శబ్దః శబ్దౌ శబ్దాః శబ్దశబ్దః అ.పు.ప్ర.బ. ఇవ అవ్య. విహాయసః,విహాయసః విహాయసోః విహాయసాం విహాయశ్శబ్దః స.న.ష.ఏ.

అపీతి. కించ అనారభమాణస్య స్వయమకించిత్కుర్వాణస్యాపి, విభోః ప్రభో ర్వ్యాపకస్యచ, పరైః రన్యైః రన్యైః ప్రతిభిః, శంఖభేర్యాదిభిశ్చ, ఉత్పాదితాః స్సంపాదితాః,జనితా శ్చార్థాః ప్రయోజనాని,విహాయసః ఆకాశస్య, శబ్దాఇవ, గుణతాం శేషతాం, కారణత్వా ద్గుణత్వంచ వ్రజంతి ప్రయాంతి,శక్తోహి రాజా స్వయ ముదాసీన ఏవ ఆకాశవత్ స్వమహిమ్నైవ కార్యదేశం వ్యాప్నువన్ శబ్దానివ సర్వార్థా నపి స్వకీయతాం నయ తీత్యర్థః. 'గుణస్త్వావృత్తిశబ్దాదిజ్యేన్ద్రియాముఖ్యతంతుష్వితి వైజయంతీ.

యాతవ్యపార్ష్ణిగ్రాహాదిమాలాయా మధికద్యుతిః,
ఏకార్థతంతుప్రోతాయాం నాయకో నాయకాయతే. ౯౨

టీ. ఏకార్థతంతుప్రోతాయాం-ఏక=ఒక్క, అర్థ=ప్రయోజనము, తంతు=దారమున, ప్రోతాయాం=గ్రుచ్చఁబడిన, యాతవ్యపార్ష్ణిగ్రాహాదిమాలాయాం-యాతవ్య=సేనతోయుద్ధమునకు యెదుర్కొనఁబడఁబోఁదగిన శత్రువు, పార్ష్ణిగ్రాహ=దండెత్తిపోవువానికి వెనుదిక్కుననుండు శత్రువును, ఆది=మొదలుగాఁగల (యొకవరుసగానున్న) వారనియెడు, మాలాయాం = రత్నమాలికయందు, అధికద్యుతిః = గొప్ప తేజస్సుగల, నాయకః=(శక్తిమంతుండగు) జిగీషువు, నాయకాయతే=మధ్య నాయకమణివలె వెలుంగుచున్నాఁడు.

తా. ఒక్కజయలాభంబునకై వరుసగాఁగూడి పెనఁగులాడుచున్న శత్రువు పార్ష్ణిగ్రాహుఁడు మున్నగు నారాజపరంపరలో దేజోవంతుఁడైన జిగీషువు ఒక్కదారమున గ్రుచ్చఁబడిన రత్నమాలికయందలి నాయకమణివలె మిన్నయై వన్నె కెక్కును.

శ. స.—యాతుం యోగ్యాః యాతవ్యాః పార్ష్ణిం గృహ్ణాతీతిపార్ష్ణిగ్రాహః, యాతవ్యశ్చ పార్ష్ణిగ్రాహశ్చ యాతవ్యపార్ష్ణిగ్రాహౌ యాతవ్యపార్ష్ణిగ్రాహౌ ఆదీ ఏషాం తే యాతవ్యపార్ష్ణిగ్రాహాదయః యాతవ్యపార్ష్ణిగ్రాహాదయ ఏవమాలా యాతవ్యపార్ష్ణిగ్రాహాదిమాలా తస్యాం యాతవ్యపార్ష్ణిగ్రాహాదిమాలాయాం, మాలాయాం మాలయోః మాలాసు యాతవ్యపార్ష్ణిగ్రాహాదిమాలాశబ్దః ఆ. స్త్రీ. స. ఏ. అధికా ద్యుతిః యస్యసః అధికద్యుతిః, ద్యుతిః ద్యుతీ ద్యుతయః అధికద్యుతిశబ్దః ఇ. పు. ప్ర. ఏ. ఏకశ్చాసావర్థశ్చ ఏకార్థః ఏకార్థఏవ తంతుః ఏకార్థతంతుః ఏకార్థతంతౌ ప్రోతా ఏకార్థతంతుప్రోతా తస్యాం ఏకార్థతంతుప్రోతాయాం, ప్రోతాయాం ప్రోతయోః ప్రోతాసు ఏకార్థతంతుప్రోతాశబ్దః ఆ. స్త్రీ. స. ఏ. నయతీతి నాయకః, నాయకః నాయకౌ నాయకాః నాయకశబ్దః అ. పు. ప్ర. ఏ. నాయక ఇవాచరతి నాయకాయతే, నాయకాయతే నాయకాయేతే నాయకాయంతే నాయకశబ్దాత్సుబంతా త్కర్తృ వాచకాదాచారే ర్థేక్యజితదంతా దకర్మకాద్ధాతోః కర్తరి వర్తమానే లటి ఆత్మ. ప్ర. పురు. ఏ.

యాతవ్యేతి. కించ ఏకార్థః ఏకప్రయోజనం, సఏవ తంతు స్సూత్రం తత్ర ప్రోతాయాం స్యూతాయాం, ఏకామిషా (భీష్టా) భిలాషిణ్యా మిత్యర్థః. ప్రపూర్వాద్వేఞః కర్మణి క్తః. 'వచిస్వ పీ'త్యాదినా సంప్రసారణమ్. యాతవ్యోఽభిషేణయితవ్యః అరిః పార్ష్ణింగృహ్ణాతీతి పార్ష్ణిగ్రాహః, పృష్ఠానుధావీ, 'కర్మణ్యత్' తా వాదీ యేషాం తే పూర్వోక్తాః పఙ్క్తిశః స్థితాః తఏవ మాలా రత్నమాలికా తస్యా మధికద్యుతిః మహాతేజాః, నాయకః శక్తిసంపన్నో జిగీషుర్నాయకాయతే మధ్యమణి రి వాచరతి, స్వయమేవ సర్వోత్కర్షేణ వర్తత ఇత్యర్థః. తస్మాద్విమృశ్య కర్తవ్య మి త్యర్థః. 'నాయకో నేతరి శ్రేష్ఠే హారమధ్యమణా వపీ'తి విశ్వః. 'ఉపమానాదాచార' ఇతి క్యఙ్. అకృత్సార్వధాతుకయో రి'తి దీర్ఘః. నాయకాయతఇత్యుపమా. అన్యథా అనుశాసనవిరోధాత్. ఏకార్థతంత్విత్యత్ర తు రూపకమధిష్ఠానతిరోధానే నారోప్యమాణతంతుత్వస్యైవ ఉద్భటత్వాత్ప్రోతత్వసిద్ధేః తదేవ యుక్తం. తద్బలాత్పార్ష్ణిగ్రాహాదిమాలాయా మిత్యత్రాపి రూపకమేవ తదనుప్రాణితా చేయ ముప మే త్యంగాంగిభావేన సంకరః.

అవ. విమర్శించి చేయుటయన నెట్లో చెప్పుచున్నాఁడు.—

షాడ్గుణ్య ముపయుఞ్జీత శక్త్యపేక్షో రసాయనమ్,
భవం త్యస్యైవ మఙ్గాని స్థాస్నూని బలవంతిచ. 83

టీ. శక్త్యపేక్షః - శక్తి=ప్రభు మంత్రోత్సాహశక్తులను (బలమును), అపేక్షస్సన్=అపేక్షించినవాఁడై, షాడ్గుణ్యం=సంధి, విగ్రహము మున్నగు నాలుగుణములనియెడు,రసాయనం=ముదిమినిబోఁగొట్టు మందును, ఉపయుంజీత=సేవించవలెను, ఏవం (సతి)=ఇట్లుచేయఁగా, అస్య=వీని, అంగాని=స్వామ్యాది రాజ్యాంగములు (అవయవములు), స్థాస్నూని=స్థిరమైనవియు, బలవంతిచ=పరపీడల సహింపఁజాలినవియు (బలముగలవియు), భవంతి=అగును.

తా. బలము నపేక్షించుచు ముదిమిని బోఁగొట్టు మందు (రసాయనము) ను సేవించువాని శరీరావయవములు యావత్కాలమును శిథిలములుగాక దృఢములై యుండునట్లు ప్రభు మంత్రోత్సాహ శక్తులను మూటి నపేక్షించుచు సంధి, విగ్రహము, యానము, ఆసనము, ద్వైధీభావము, సమాశ్రయము ననుషడ్గుణములను నుపయోగించు రాజుయొక్క రాజ్యాంగములు (స్వామి, జనపదము, అమాత్యుఁడు, కోశము, దుర్గము, బలము, సుహృత్తు ననునవి) యేడును స్థిరములై నిలచి పరపీడల సహింపఁజాలునవి యగును.

శ. స.—షట్చతేగుణాశ్చ షడ్గుణాః షడ్గుణా ఏవ షాడ్గుణ్యం తత్ షాడ్గుణ్యం, షాడ్గుణ్యం షాడ్గుణ్యే షాడ్గుణ్యాని షాడ్గుణ్యశబ్దః అ. న. ద్వి. ఏ. ఉపయుంజీత ఉపయుంజీయాతాం ఉపయుంజీరన్ ఉపపూర్వకయు జిర్ యోగ ఇత్యస్మాత్సకర్మకాత్కర్తరి విధ్యాదాలజి ఆత్మ. ప్ర. పురు. ఏ. శక్తిమపేక్షత ఇతిశక్త్యపేక్షః, శక్త్యపేక్షః శక్త్యపేక్షౌ శక్త్యపేక్షాః శక్త్యపేక్షశబ్దః అ. పు. ప్ర. ఏ. రసాయనం రసాయనే రసాయనాని రసాయనశబ్దః అ. న. ద్వి. ఏ. భవతి భవతః భవంతి భూసత్తాయా మిత్యస్మాదకర్మకాద్ధాతోః కర్తరి వర్తమానే లటి పరస్మై ప్ర.పురు.బ.అస్య,అస్య అనయోః ఏనయోః ఏషాం ఇదం శబ్దః మ.పు.ష.ఏ.ఏవం అవ్య. అంగం,అంగం అంగే అంగాని అంగశబ్దః

అ. న. ప్ర. బ. తిష్ఠన్తీతి స్థాస్నూని, స్థాస్ను స్థాస్నునీ స్థాస్నూని స్థాస్నుశబ్దః ఉ. న. ప్ర. బ. బలమేషా మస్తీతి బలవంతి బలవత్ బల వతీ బలవంతి బలవచ్ఛబ్దః త. న. ప్ర. బ. చ అవ్య.

అథ విమృశ్యకరణప్రకార మాహ.—

షాడ్గుణ్యమితి. శక్తిం ప్రభావాదిత్రయం, బలంచాపేక్షత ఇతిశక్త్యపేక్షస్సన్, పదాద్యచ్. 'శక్తిర్బలే ప్రభావాదా' వితి విశ్వః షడ్గుణాః షాడ్గుణ్యం సంధివిగ్రహాది షట్కం, చాతుర్వర్ణ్యాదిత్వాత్స్వార్థేష్యఞ్ప్రత్యయః. తదేవ రసాయన మౌషధవిశే షం, ఉపయుంజీత సేవేత, 'రసాయనం విహంగేఽపి జరావ్యాధిభిదౌషధ' ఇతి విశ్వః. 'యజ్జరావ్యాధివిధ్వంసభేషజం తద్రసాయన' మితి వాహటశ్చ. ఏవ సత్య స్యోపయో క్తురంగాని, స్వామ్యాదీని 'స్వామిజనపదోఽమాత్యఃకోశోదుర్గ బలంసుహృత్, రాజ్యం సప్తప్రకృత్యజ్గం నీతిజ్ఞా స్సంప్రచక్షతే' ఇతి. గాత్రాణిచ స్థాస్నూని, స్థిరాణి, కాలాంతరక్షమాణీత్యర్థః. 'గ్లాజిస్థశ్చగ్స్నుః' తి గ్స్నుప్రత్యయః బల వంతిచ పరపీడనక్షమాణిచ, భవంతి, శ్లిష్టపరంపరితరూపకం.

స్థానే శమవతాం శక్త్యా వ్యాయామే వృద్ధి రంగినామ్,
అయథాబల మారంభో నిదానం క్షయసంపదః. ౯౪

టీ. స్థానే=అశక్యములపట్ల, శమవతాం=ఓర్పుగలిగిన, అంగి నాం=సప్తాంగములతోఁగూడిన రాజులకు (దేహధారులకు), శక్త్యా= ప్రభావాద్యనుసరణముచే (బలానుసరణముచే), వ్యాయామే=వ్యాపా రముగలుగఁగా, వృద్ధిః = అభివృద్ధి (అగును), అయథాబలం = శక్తిని మించి, ఆరంభః=వ్యాయామము, క్షయసంపదః=మిక్కిలి క్షీణించు టకు, నిదానం=మూలకారణము.

తా. అశక్తులగు మానవు లోపికపట్టి తమకున్న బలమునకు తగునట్లు నడుచుట మున్నగు వ్యాయామములను జేసినచో పుష్టిగలిగి వారిశరీరము వృద్ధిజెందునట్లు అశక్యమయిన చోటులయం దోర్పుగల వారై సప్తాంగములతోఁ గూడిన రాజులు తమకుగల ప్రభావాదులకు తగినట్లు షడ్గుణములను ప్రయోగించుచువచ్చినఁ దమ రాజ్య మభివృద్ధి నొందును. శక్తికి మించిన వ్యాయామ మంగములకు మిగుల హానికర మగును. కాఁబట్టి మన మకస్మాత్తుగా శిశుపాలు నెదుర్కొని పోవుట శ్రేయస్కరము గాదని భావము.

శ. స.—స్థానే, స్థానే స్థానయోః స్థానేషు స్థానశబ్దః అ. న. స.ఏ. శమః ఏషా మస్తీతి శమవంతః తేషాం శమవతాం, శమవతః శమవతోః శమవతాం శమవచ్ఛబ్దః త.పు.ష.ఏ.శక్త్యా, శక్త్యా శక్తిభ్యాం శక్తిభిః శక్తిశబ్దః ఇ. స్త్రీ. తృ.ఏ. వ్యాయామే, వ్యాయామే వ్యాయామయోః వ్యాయామేషు వ్యాయామశబ్దః అ. పు.స. ఏ. వృద్ధిః, వృద్ధిః వృద్ధీ వృద్ధయః వృద్ధిశబ్దః ఇ. స్త్రీ.ప్ర.ఏ. అంగాని ఏషాం సంతీతి అంగినః తేషాం అంగినాం,అంగినః అంగినోః అంగినాం అంగిశబ్దః న. పు. ష. బ. బలమనతిక్రమ్య యథాబలం న యథాబలం అయథాబలం అవ్యయీభావావ్యయం. ఆరంభః,ఆరంభః ఆరంభౌ ఆరంభాః ఆరంభశబ్దః అ. పు. ప్ర. ఏ. నిదానం, నిదానం నిదానే నిదానాని నిదానశబ్దః అ. న. ప్ర. ఏ. క్షయస్య సంపత్ క్షయసంపత్ తస్యాః క్షయసంపదః, క్షయసంపదః క్షయసంపదోః క్షయసంపదాం క్షయసంపచ్ఛబ్దః ద. స్త్రీ. ష. ఏ.

స్థానఇతి. కించ,స్థానే అశక్యవిషయే,శమవతాం క్షమావతాం,అంగినాంసప్తాంగినాం రాజ్ఞాం శరీరిణాంచ,శక్త్యాప్రభావాద్యనుసారేణ బలానుసారేణచ,వ్యాయామే వ్యాపారే,షాడ్గుణ్యప్రయోగే గమనాదౌ చ సతీత్యర్థః. వృద్ధిరుపచయో రాజ్యస్య శరీరస్యచేతిభావః. విపక్షే బాధకమాహ—అయథాబలం శక్త్యతిక్రమేణ,'యథాసాదృశ్యే'ఇత్యవ్యయీభావేనషష్ఠసమాసః. ఆరంభో వ్యాయామః క్షయసంపదోఽత్యంతహానేర్నిదానం ఆదికారణం, అంగానా మితి భావః. తస్మా దస్మాక మకస్మాచ్చైద్యాస్కందన మశ్రేయస్కర మితి భావః. అత్ర విశేష్యస్యాపి శ్లిష్టత్వా చ్ఛబ్దశక్తిమూలో వస్తునా వస్తుధ్వనిః. తతో ద్వయానా మంగినా మౌపమ్యం గమ్యత ఇతి సంక్షేపః.

అవ. సారాంశమును చెప్పుచున్నాఁడు.—

తదీశితారం చేదీనాం భవాం స్త మవమం స్తమా,
నిహంత్యరీ నేకపదే య ఉదాత్త స్స్వరా నివ. ౯౫

టీ. తత్=అందువలన, చేదీనాం= చేదిదేశములకు, ఈశితారం=శాసకుఁడగు, తం=ఆ శిశుపాలుని, భవాన్=నీవు, మాఽవమంస్త=అవమానింపవలదు, యః=ఏ శిశుపాలుఁడు, ఉదాత్తః=ఉదాత్తస్వరము, స్వరానివ=స్వరితాది స్వరములనుంబోలె, అరీన్ = శత్రువులను, ఏకపదే=ఒక్క అడుగులో,(ఏకపదమందు) నిహంతి=హింసించుచున్నాఁడో (అనుదాత్తములనుగాఁ జేయుచున్నది.)

తా. అశక్యమైన కార్యములు చేయరాదు గనుక చేదిదేశా ధీశ్వరు శిశుపాలు నీ వలక్ష్యముచేయఁబోరాదు. ఆతఁడిప్పుడతిశూరుఁడై యుదాత్తస్వరం బేకపదంబునందలి స్వరితాది స్వరములనన్నిటి ననుదాత్తములుగాఁజేయున ట్లొక్క యడుగులో శత్రువులనెల్ల నడంచుచున్నాఁడు.

శ. స.—తత్ అవ్య. ఈశితారం, ఈశితారం ఈశితారా ఈశితౄన్ ఈశితృశబ్దః ఋ.పు.ద్వి.ఏ. చేదీనాం ఇ.పు.ని.బ.ష.బ. భవాన్, భవాౝ భవంతౌ భవంతః భవచ్ఛబ్దః త.పు.ప్ర.ఏ. తం, తం తౌ తాన్ తచ్ఛబ్దః ద.పు. ద్వి. ఏ. అవమంస్త అవమాసాతాం అవమంసత అవ పూర్వకమను అవబోధన ఇత్యస్మాత్సకర్మకాద్ధాతోః కర్తరి భూతేలుఙి ఆత్మనే.ప్ర.పురు.ఏ. మా అవ్య. నిహంతి నిహతః నిఘ్నంతి నిపూర్వక హానహింసాగత్యోరిత్యస్మా త్సకర్మకా త్కర్తరి వర్తమానేలటి పరస్మై.ప్ర.పురు.ఏ.అరిం, అరిం అరీ అరీన్ అరిశబ్దః ఇ.పు.ద్వి.బ. ఏకంచ తత్పదంచ ఏకపదం తస్మిన్ ఏకపదే, ఏకపదే ఏకపదయోః ఏకపదేషు ఏకపదశబ్దః అ. న. స. ఏ. యః, యః యౌ యే యచ్ఛబ్దః ద. పు. ప్ర. ఏ. ఉదాత్తః ఉదాత్తౌ ఉదాత్తాః ఉదాత్తశబ్దః అ. పు. ప్ర. ఏ. స్వరం, స్వరం స్వరౌ స్వరాన్ స్వరశబ్దః అ. పు. ద్వి. బ. ఇవ అవ్య.

ఫలిత మాహ.—

తదితి. తత్తస్మా దశక్యార్థ స్యాకార్యత్వా చ్చేదీనా మీశితారం శిశుపాలం భవా న్మావమంస్త నావమన్యస్వ, మన్యతే ర్మాఙి లుఙ్. అనుదాత్తత్వా న్నేడాగమః. కుతః య శ్చైద్య ఉదాత్త (స్స న్నుదాత్త ఇతి శ్లిష్టో దాత్తః) స్వరాౝ పరిశిష్టాౝ స్వరితాదీ నివారీ నేకపదే ఏకస్మిౝ పదన్యాసే, సుప్తిఙంతలక్షణే చ నిహంతి హినస్తి, నీచైః కరోతిచ, అతిశూరత్వాత్. 'అనుదాత్తంపదమేకవర్జమి'తి పరిభాషా బలాచ్చేతి భావః.

అవ. ఈశిశుపాలుఁ డొంటరివాఁడు మన నేమి జేయఁగలఁడని తలంచరాదని చెప్పుచున్నాఁడు.—

మావేది య దసా వేకో జేతవ్య శ్చేదిరా డితి,
రాజయక్ష్మే వ రోగాణాం సమూహ స్స మహీభృతామ్. ౯౬

టీ. అసౌ=ఈ, చేదిరాట్=చేదిదేశపురాజు (శిశుపాలుఁడు),

ఏకః=ఒంటిగాఁడు, (కనుక) జేతవ్యః=జయింపశక్యమైనవాఁడు, ఇతి=అని, మా వేది=తెలిసికొనవలదు, యత్=ఎందువలన, సః = వాఁడు, రాజయక్ష్మా=క్షయరోగము, రోగాణామివ = రోగములయొక్కయుం బోలె, మహీభృతాం=రాజులయొక్క, సమూహః=మొత్తమో.

తా. ఈశిశుపాలుఁ డేకాకియై యున్నవాఁడు గదా మనము సుకరముగా జయింపవచ్చునని తలంప నయితిగాదు. క్షయరోగ మెల్ల రోగములయొక్కయు సమష్టిరూపమైనట్లు ఈతఁడు సమస్త రాజుల యొక్కయు సమష్టి స్వరూపుఁడై వెలుంగుచున్నవాఁడు ఒక్కఁడే రాజ పుంజంబునంత బలంబు గలవాఁడుగనుక క్షయరోగమువలె నసాధ్యుఁడని తాత్పర్యము.

శ. స.—మా అవ్య. వేది వేదిషాతాం వేదిషత విదజ్ఞాన ఇత్యస్మాత్సకర్మకాత్కర్మణి భూ తేలజి ఆత్మ. ప్ర.పురు. ఏ. యత్ అవ్య. అసౌ, అసౌ అమూ అమీ అదశ్శబ్దః స. పు. ప్ర. ఏ. ఏకః ఏకశబ్దః అ. పు. ని. ఏ. ప్ర. ఏ. జేతుః శక్యః జేతవ్యః, జేతవ్యః జేతవ్యౌ జేతవ్యాః జేతవ్యశబ్దః అ.పు.ప్ర.ఏ. చేదీనాంరాట్ చేదిరాట్, చేదిరాట్ చేదిరాజౌ చేదిరాజః చేదిరాట్ఛబ్దః జ.పు.ప్ర.ఏ. ఇతి అవ్య. రాజ్ఞః యక్ష్మా రాజయక్ష్మా (రాజాచాసౌ యక్ష్మాచ రాజయక్ష్మా) యక్ష్మా యక్ష్మాణౌ యక్ష్మాణః రాజయక్ష్మశబ్దః న. పు. ప్ర. ఏ. ఇవ అవ్య. రోగస్య, రోగస్య రోగయోః రోగాణాం రోగశబ్దః అ. పు. ష. బ. సమూహః, సమూహః సమూహౌ సమూహాః సమూహశబ్దః అ. పు. ప్ర.ఏ. సః తౌ తే తచ్ఛబ్దః ద.పు.ప్ర.ఏ. మహీంబిభ్రతీతి మహీభృతః తేషాం మహీభృతామ్, మహీభృతః మహీభృతోః మహీభృతాం మహీభృచ్ఛబ్దః త. పు. ష. బ.

న చాయ మేకాకీ శిశుపాలః కిం నః కరిష్యతీతి మంతవ్య మిత్యాహ.—

మా వేదీతి. అసౌ చేదిరాట్ ఏక ఏకాకీ అతో జేతవ్యః సుజయ్య ఇతి మా వేది మాజ్ఞాయి, వేత్తేః కర్మణి మాజి లుఙ్. యద్యస్మాత్స చేదిరాట్ రాజ్ఞశ్చంద్రస్య యక్ష్మా యద్వా రాజాసౌ యక్ష్మేతి వా రాజయక్ష్మా క్షయరోగః రోగాణామివ మహీభృతాం సమూహః సమష్టిరూపః, యథాహ బాహటః—'అనేకరోగానుగతో బహురోగపురోగమః, రాజయక్ష్మా క్షయశ్శోషో రోగరా డితి చ స్మృతః. నక్ష

త్రాణాం ద్విజానాం చ రాజ్ఞో ఽభ్యుదయం పురా, యచ్చ రాజా చ యజ్ఞశ్చ రాజయజ్ఞౌ తతో మత' ఇతి. అతో దుర్జయ ఇతిభావః. ఏతేన 'చిరస్య మిత్రవ్యసనీ సుదమో దమఘోషజ' ఇతి వాక్యార్థో నిరస్తః.

అవ. ఇఁక నీతనియెల్ల తేఁడుల మొత్తపుందనమును వివరించుచున్నాఁడు.—

సంపాదితఫల స్తేన సపక్షః పరభేదకః,
కార్ముకే నేవ గుణినా బాణ స్సంధాన మేష్యతి. ౮౭

టీ. సంపాదితఫలః - సంపాదిత=సంపాదింపఁబడిన, ఫలః=లాభము (బాణము ములికి, అలుఁగు) కలిగినట్టియు, సపక్షః=చెలికాండ్రతోఁ (కంకపత్రములతోఁ) గూడినట్టియు, పరభేదకః=శత్రువులనుద్రుంచు, బాణః=బాణాసురుఁడు (అమ్ము), గుణినా=శౌర్యాదిగుణములుగల (అల్లెత్రాడుగలిగిన), తేన=ఆశిశుపాలునితో, కార్ముకేనేవ=ధనస్సుతోడనుంబోలె, సంధానం=సంధిని, ఏష్యతి=పొందఁగలఁడు.

తా. ములుకు లమర్చి వేగముగాఁబోవ రాపులుఁగుఱెక్కలు గట్టినబాణము శత్రుభేదకమై యెక్కువెట్టిన ధనుస్సుతో సంధానమునకు సిద్ధమగునట్లు కోశాది సంపత్తిలాభము సంపాదించుకొని సుహృద్బలముతోఁ గూడుకొనిన బాణాసురుఁడు శత్రుసంహారమునకుఁ జాలినవాఁడై శౌర్యాదిసంపన్నుఁడగు శిశుపాలునికి సహాయపడఁగలఁడు కావున నీతఁ డేకాకిగాఁడని భావము.

శ. స.—సంపాదితం ఫలం యస్య సః సంపాదితఫలః, ఫలః ఫలౌ ఫలాః సంపాదితఫలశబ్దః అ. పు. ప్ర. ఏ. తేన, తేన తాభ్యాం తైః తచ్ఛబ్దః ద. పు. తృ. ఏ. పక్షైః సహవర్తత ఇతి సపక్షః, సపక్షః సపక్షౌ సపక్షాః సపక్షశబ్దః అ. పు. ప్ర. ఏ. పరేషాం భేదకః పరభేదకః, భేదకః భేదకౌ భేదకాః పరభేదకశబ్దః అ. పు. ప్ర. ఏ. కర్మణే ప్రభవతీతి కార్ముకమ్ తేన కార్ముకేన, కార్ముకేన కార్ముకాభ్యాం కార్ముకైః కార్ముకశబ్దః అ. న. తృ. ఏ. ఇవ అవ్య. గుణాః అస్య సంతీతి గుణీ తేన గుణినా, గుణినా గుణిభ్యాం గుణిభిః గుణిశబ్దః న. పు. తృ. ఏ. (గుణః అస్మిన్ అస్తీతి గుణీ తేన గుణినా, గుణినా గుణిభ్యాం గుణిభిః గుణి

శబ్దః ఇ.న.తృ. ఏ.) బాణః, బాణః బాణౌ బాణాః బాణశబ్దః అ.పు.తృ. ఏ. సంధానం, సంధానమ్ సంధానే సంధానాని సంధానశబ్దః అ.న.ద్వి.ఏ. ఏష్యతి ఏష్యతః ఏష్యంతి ఇణ్ గతా విత్యస్మాత్సకర్మకాత్కర్తరి భవిష్యదర్థేల్ృటి పర. ప్ర. పురు. ఏ.

అథాస్య సర్వరాజసమష్టితా మేవ ద్వాభ్యా మాచష్టే.—

సంపాదితేతి. సంపాదితం, ఫలం లాభః, శరాగ్రంచ యస్యసః, 'ఫలం లాభశ్శరాగ్రయో రి'తి శాశ్వతః. సపక్షః స్ససుహృత్, కంకాదిపత్త్రియుక్తశ్చ పరేషాం భేదకశ్శత్రువిదారణః, బాణో బాణాసుర శ్శరశ్చ, గుణినా శౌర్యాదిగుణవతా, అధిజ్యేన చ తేన చైద్యేన, కర్మణే ప్రభవ తీతి కార్ముకం, 'కర్మణఉకఞ్' తేనైవ సంధానం సంధి మేష్యతి అథో నైకా కీతి భావః. అత్రాప్యుపమా శ్లేషో నా మతభేదాత్.

యేచాన్యే కాలయవన సాల్వరుక్మి ద్రుమాదయః,
తమస్స్వభావా స్తేఽప్యేనం ప్రదోష మనుయాయినః. ౯౮

టీ. అన్యే = ఇతరులగు, కాలయవనసాల్వరుక్మిద్రుమాదయః = కాలయవనుఁడు, సాల్వుఁడు, రుక్మి, ద్రుముఁడు మొదలగు, యేచ = ఏయే రాజులు, తమస్స్వభావాః = తమోగుణముస్వభావముగాఁగలవారు (కలరో), కనుకనే, తేఽపి = వారును, ప్రదోషం = దుష్టుఁడగు (తామసుఁడే యగు), ఏనం = వీనిని, అనుయాయినః = అనుసరించువారు.

తా. చీకటి ప్రదోషకాలము ననుసరించి యుండినట్లు కాలయవనుఁడు సాల్వుఁడు రుక్మి ద్రుముఁడు మున్నగు తమోగుణప్రధానులైన మఱికొందఱు రాజులును దమవలె తామసుఁడగు నీశిశుపాలుని వెంబడించి యుందురు.

శ. స.—యః, యః యౌ యే యచ్ఛబ్దః ద.పు.ప్ర.బ.చ అవ్య. అన్యః, అన్యః అన్యౌ అన్యే అన్యశబ్దః అ.పు.ప్ర.బ. కాలయవనశ్చ సాల్వశ్చ రుక్మీచ ద్రుమశ్చ కాలయవన సాల్వరుక్మిద్రుమాః కా...ద్రుమాః ఆదయః యేషాం తే కాలయవనసాల్వరుక్మిద్రుమాదయః, ఆదిః ఆదీ ఆదయః కాలయ...మాదిశబ్దః ఇ. పు. ప్ర. బ. తమః స్వభావః యేషాం తే తమస్స్వభావాః, స్వభావః స్వభావౌ స్వభావాః తమస్స్వభావశబ్దః అ. పు.ప్ర. బ. సః, సః తౌ తే తచ్ఛబ్దః ద.పు.ప్ర.బ. అపి అవ్య. ఏనం,

ఏనం ఏనౌ ఏనాన్ ఇదంశబ్దః మ.పు.ద్వి.ఏ. ప్రకృష్టః దోషః యస్యసః ప్రదోషః తం ప్రదోషం, ప్రదోషం ప్రదోషౌ ప్రదోషాన్ ప్రదోష శబ్దః అ. పు. ద్వి. ఏ. అనుసృత్య యాస్యంతీత్యనుయాయినః, అను యాయీ అనుయాయినౌ అనుయాయినః అనుయాయిన్శబ్దః న. పు. ప్ర. బ.

యేచేతి. కిం చ అన్యే కౌలయవనసాల్వరుక్మిద్రుమాదయో యే రాజానః తమ స్స్వభావా స్తమోగుణాత్మకాః, అతఏవ తేఽపి ప్రదోషం ప్రకృష్టదోషం, తామస మేవైనం, చైద్యం అనుయాయిన అనుయాస్యంతః, సాదృశ్యా దితి భావః. 'భవిష్యతి గమ్యాదయ'ఇతి ణినిః భవిష్యదర్థే. 'అకేనోర్భవిష్యదాధమర్ణ్యయో రి'తి షష్ఠీప్రతిషే ధా ద్వితీయా. యథా ధ్వాంతం రజనీముఖం అనుయాతి తద్వ దితి వస్తు నాలంకార ధ్వనిః. 'రాహౌ ధ్వాంతే గుణే తమ' ఇత్యమరః. 'ప్రదోషో దుష్టరాత్ర్యంశా వి'తి వైజయంతీ.

అవ. ఓయీ!(పైఁజెప్పిన) బాణాదులిప్పుడు మనతో సంధిగలిగి యున్నవారు భేదిల్లరు అనునెడ చెప్పుచున్నాఁడు.—

ఉపజాపః కృత స్తేన తా నాకోపవత స్త్వయి,
ఆశు దీపయితా ల్పోఽపి సాగ్నీ నేధానివా నిలః. ౯౯

టీ. తేన=ఆశిశుపాలునిచేత, కృతః=చేయఁబడిన, అల్పోఽపి= కొలఁదిమాత్రమైనను, ఉపజాపః=భేదము, త్వయి=నీయందు, ఆకోప వతః=మిక్కిలికోపముగల, తాన్=ఆబాణాదులను, అనిలః=వాయువు, సాగ్నీన్=అగ్నితోఁగూడిన, ఏధానివ=చిదుకులనుంబోలె, ఆశు=తో డనే, దీపయితా=మండింపఁగలదు.

తా. కొంచెము నిప్పంటుకొనియున్న చిదుకులు గాలితగిలిన తోడనే భగ్గుమనిమండునట్లు శిశుపాలుఁడేమాత్రపుభేదము పుట్టించి నను అంతర్వైరముగల బాణాదులు మండిపడుదురు.—మనమెంత సంధిచేసికొనియున్నను లోలోపల పగగలవారు సందుదొరికినప్పుడు వేఱె పగదీర్చుకొందురని తాత్పర్యము.

శ. స.—ఉపజాపః, ఉపజాపః ఉపజాపౌ ఉపజాపాః ఉపజాపశబ్దః అ.పు.ప్ర.ఏ. కృతః, కృతః కృతౌ కృతాః కృతశబ్దః అ. పు. ప్ర. ఏ. తేన, తేన తాభ్యాం తైః తచ్ఛబ్దః ద.పు.తృ. ఏ. తం, తం తౌ తాన్ తచ్ఛబ్దః

ద. పు. ద్వి. బ. ఆకోపవంతం, ఆకోపవంతౌ ఆకోపవతః ఆకోపవచ్ఛబ్దః త. పు. ద్వి. బ. త్వయి, త్వయి యువయోః యుష్మాసు యుష్మచ్ఛబ్దః ద. పు. స. ఏ. ఆశు అవ్య. దీపయితా, దీపయితారౌ దీపయితారః దీపయితారః దీపీ దీప్తౌ విత్యస్మాద్ధాతోర్ణిజంతాత్సకర్మకాత్కర్తర్యనద్యతనభవిష్యతిలుటి పర. ప్ర. పు. ఏ. అల్పః, అల్పః అల్పౌ అల్పాః అల్పశబ్దః అ. పు. ప్ర. ఏ. అపి అవ్య. అగ్నినాసహావర్తంత ఇతి సాగ్నయః తాన్ సాగ్నీన్, సాగ్నిం సాగ్నీ సాగ్నీన్ సాగ్నిశబ్దః ఇ. పు. ద్వి. బ. ఏధం, ఏధం ఏధౌ ఏధాన్ ఏధశబ్దః అ. పు. ద్వి. బ. ఇవ అవ్య. అనిలః, అనిలః అనిలౌ అనిలాః అనిలశబ్దః అ. పు. ప్ర. ఏ.

నను బాణాదయోఽస్మాభి రిదానీం కృతసంధానాః న విరాధ్యంతీత్యత్రాహ.—

ఉపజాపఇతి. తేన చైద్యేన కృత ఆలోపేఽప్యుపజాపో భేదః, 'భేదోపజాపావుపధే' త్యమరః. త్వయి ఆకోపవతః ప్రకోపవతస్తాన్ బాణాదీన్, అనిలః సాగ్నీనేధానింధనానీవ, 'కాష్ఠం దార్వింధనం త్వేధ ఇధ్మమేధ స్సమిత్ స్త్రియా' మిత్యమరః. ఆశు దీపయితా సద్యః ప్రజ్వలయిష్యతి. 'దీపేర్ణ్యంతాల్లుట్' అంతరైర్వారాస్సంహితా అపి సతి రంధ్రే సద్యో విశ్లిష్యంతీతి భావః. ఉపమా.

బృహత్సహాయః కార్యాంతం క్షోదీయానపి గచ్ఛతి,
సంభూయాంభోధి మభ్యేతి మహానద్యానగాపగా. ౧౦౦

టీ. బృహత్సహాయః=గొప్పసహాయము గలిగిన, క్షోదీయానపి=మిక్కిలియల్పుఁడుంగూడ, కార్యాంతం=పనియొక్క ముగింపును, గచ్ఛతి=పొందును, నగాపగా=సెలయేఱు, మహానద్యా=పెద్దయేఱుతో, సంభూయ=కలిసి, అంభోధిం=సముద్రమును, అభ్యేతి = పొందుచున్నది.

తా. మిక్కిలియల్పుఁడైనను గొప్పసహాయము గ్లవాఁడైనచోఁ గార్యసిద్ధిఁ బొందఁగలుగును. చిన్నచిన్న సెలయేళ్లు మహానదితోఁ గలసి సముద్రముఁ జొచ్చుచున్నవి గదా ? అల్పుఁడే యిట్లయినప్పుడు అట్టిమహావీరుండగు శిశుపాలుని సంగతి వేఱ చెప్పవలయునా ?

శ. స.—బృహన్ సహాయో యస్యసః బృహత్సహాయః, సహాయః సహాయౌ సహాయాః బృహత్సహాయశబ్దః అ. పు. ప్ర. ఏ. కార్యస్య

